

# చంద్రగిర్యభ్యుదయము

ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుచే

రచియింపఁబడిన చరిత్రనాటకము.

కె. శత్రుఘ్నరావుచే

ప్రకటింపబడియె.

మొదటికూర్పు.



బళ్ళారి.

ఆంధ్రాముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1925.



వెల రు. 1—0—0

## ఈ నాటకమునందలివచ్చు ముఖ్యపాత్రలు.

### పురుష పాత్రలు.

బ్రాహ్మణులైదుగురు
మార్కండేయశాస్త్రులు
యాచమనాయఁడు
సదాశివయోగి
చాందుఖాఁ
పంచమజాత్యర్భకుఁడు
బ్రాహ్మణఋషి
వృద్ధవెంకటరాజు
జగదేకరాయఁడు
ఓబళనాయక
తిమ్మానాయక
మకరనాయక
చిక్కరాయఁడు
శ్రీరంగరాయఁడు
కరణంమహాదేవప్ప
రెడ్డిలింగనగవుడు

నరసరాజు
వీరనరసింగ
అరుణాచలం
వకీలు
వెంకోబ
చాకలినరసిగాడు
చిన్నవెంకటరాయఁడు
రాజదేవుఁడు
దుర్గప్పనాయఁడు
గుండనాయక
ఇరుగనాయక
కేశవశాస్త్రులు
ముద్దురంగడు
భటులు
తురకసేన
వేటకాండ్రు

### స్త్రీ పాత్రలు.

కుముదిని
చాకలిచెంప
ఛాయమ్మ

# శ్రీనివాసనుకవి జీవితచరిత్ర.

---

ఎవ్వాని వదనరాజీవరంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టనలుపుచుండునో! ఎవ్వాఁడు సువ్యాఖ్యావిషమూర్ఛితయగు కాళిదాస కవితాకన్యకను దనదు సంజీవినిచేఁ దెప్పతిల్లఁజేసి ఒజ్జలమిన్న యని వన్నెకెక్కెనో! ఏమహామహు దివ్యనామామృతమును వీనులారఁ గ్రోలనియతఁడు వాస్యేఁ దోఁకఁ లైన సీభువిని గానఁబడఁడో! ఏమహితచారిత్రుని యశఃకుసుమంబుల ధరియించి దివాకర నిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో!

ఏవిద్వద్వతంసుఁడు అనన్యజన సామాన్యముగు మహామహోపాధ్యాయ బిరుదమునకు మార్గదర్శియయ్యెనో! అట్టి చుళికీకృతసకల శాస్త్రజలధియగు కోలచల శ్రీమల్లినాథసూరి వంశమున మన శ్రీనివాస కవిముక్తామణి విరూపాక్ష క్షేత్రమునకు సమీపముననుండు కామలాపురమను గ్రామమునఁ గ్రీస్తుశకము 1854-8-18 తేదీలకు సరియగు ప్రమాదీచ సంవత్సర ఫాల్గుణాసిత చతుర్దశినాఁ డుద్భవించె. ఇతఁడు బాల్యముననే సంస్కృతభాషను జక్కఁగ నభ్యసించి, పిదప నాంగ్లేయ భాషయం దసమానవైదుష్యమును గడించి, కొంతకాలము రాజకీయోద్యోగిగనుండి, తర్వాత న్యాయవాదిపరీక్షయం దుత్తీర్ణుఁడై బళ్లారి పురవరమున న్యాయవాదిగ మెలఁగుచుండె. ఇతనికి నొకకూఁతురును, నలుగురు కుమారులును గలరు. మఱియు నితఁడు 1917 సం॥ ఏప్రెల్ 7 తేది దేహళీపురమున జరిగిన విద్వత్సభ యని ప్రసిద్ధిఁ గాంచిన యాంధ్రసాహిత్య పరిషత్సభ కగ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్టుండ నేతత్కవిచంద్రుఁడు రాజద్రణపీడితుఁడై యాంధ్రకువలయంబు వసివాడఁగు కవిచక్రంబు లుల్లసిల్ల 1919 సం॥ జూన్ 23 తేది యస్తమించె.

ఇట్లు విన్నవించు,

సుధీజన విధేయుఁడు,

రావాడి - వెంకటరామశాస్త్రి

తెనుఁగుపండితుఁడు, మునిసిపల్ హైస్కూలు, బళ్లారి.

# పీఠిక.

ఈ నాటకంబును వ్రాసితినిగాని దీనికి నామకరణంబేమి చేయనగునని బహుదూరమాలోచించినను నాకుఁదోఁచదాయెను. తుదకొకవిషయము జ్ఞప్తికివచ్చెను. నాచే వ్రాయఁబడిన తాళికోట యుద్ధవిషయ నాటకమునకు "రామరాజు లేక విజయనగర రాజ్యనాశన" మని యెటుపేరిడితినో యటులనే దీనిపేరు "విజయుడు లేక చంద్రగిరి రాజ్యస్థాపన" మని పేరిడుట శ్రేయమని నేఁ దలఁచితిని. కావున నాటకనామము నదియె యుంచితి. ఈ కథను నాటకముగ వ్రాయుటకునై నేను కొన్నిగ్రంథములం జదివితి అందున.

1. స్వ్యూయల్లుదొరగారి మఱుగుపడిన రాజ్యము.
2. దు. నా. రామక్రిష్ణపిళ్లెగారి "పద్మిని" యను నవల.
3. బ్రహ్మశ్రీ శిరోభూషణ వెంకటరంగాచార్యులచే రచింపఁబడిన "రంగరాయ విజయము" నవల.
4. కర్ణాటకభాషలో బ్రచురింపఁబడిన "కుముదిని" యను నవల.

ఇందున స్వ్యూయలుగారు వ్రాసిన భాగమే చరిత్రాంశములు జరిగినకాలములోఁ గొచ్చిన్నులోనుండిన బార్రడాసనుదొర 16-12-1616 లో యూరోపునకువ్రాసిన జాబునందలివార్త కావున దాని నిజస్థితిని సంశయించుటకు మనకు నే యాధారమును లేదు.

2-3 సంఖ్యలుగల గ్రంథకర్తలే యాధారములనుబట్టి చరిత్రాంశములను మార్చిరో తెలియకయున్నది. నవలలుగనుక పొందుపఱచుటకై వ్రాయుచున్నను చరిత్రాంశము పొరలునటులఁ గల్పనగనుగాని ముఖ్యాంశములను మార్చుట గొప్పతప్పు. రాఁబోవు చదువరులకు నీ తప్పులే ప్రమాణములగును. రామకృష్ణపిళ్లెగారు జెఱలోఁబడిన వెంకటరాజు కొమారుఁడు శ్రీరంగరాజు తనపట్టాభిషేకకాలమున ఫోర్టుసెంటుజార్జిని "డే" యనువానికి 1639 సంవత్సరం మార్చి 1-టో తేదీన నిచ్చెనని వ్రాసినారు. నై యాధారమును బట్టియే, "రంగరాజవిజయ" మును జేసిన యాచార్యులవారు, "డే" కునిచ్చిన యదే కాలమున నిచ్చెననిన్ని వారిచ్చిన స్థలముపేరు చెంబరపాళెమనిన్ని యది చెంగల్పట్టుకు సమీపమున నున్నదనిన్ని వ్రాసినారు. ఆచార్యులవారు రామకృష్ణపిళ్లెగారి నవలకే, వేఱుపేరుఁబెట్టి కొన్ని చిట్టికథలను దీసియుఁ, గొన్ని చేర్చియు, నిజ్జిపు నవలను, తమస్వంతభాషకు మార్చినారు. వృద్ధరాజగారగు వెంకటరాజుగారు తమ యన్నకొమారుఁడు మూఁడవ రంగరాయనికి రాజ్యమిచ్చినది 1614 సంవత్సరమునందని చరిత్రలు తెలుపుచున్నవి. వెంటనే కలఁతలుపడెను రెండు సంవత్సరములు కలఁతలుండి తుదకుఁ జెఱనుండి తప్పించుకొనిన వాల్లన రంగరాజు 1616 సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. కావున 1616-వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడైన వాల్లన రంగరాజునకు మఱల 1639 సంవత్సరమునఁ బట్టాభిషేకమగునా? ఎన్నటికినిగాదు. 1639 సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడయిన వాఁడాఱవ రంగరాజు. అ యాఱవరంగరాజే, "డే" దొరగారికి, జార్జికోటనిచ్చినది.

స్వ్యూయలుగారీరీతి వ్రాయుచున్నారు.

with eight thousand men and refused to join Jagaraya .... .... .... ....
Jagaraya sent a message to this man, bidding him come and do homage to his nephew and saying that if he refused hewould destroy him. Echama Naique made answer that he was not the man to do reverence to a boy who was the son of no one knew whom, nor even what his caste was; and, so far as destroying him went, would Jagaraya come and meet him? If so, he would wait for him with such troops as he possessed: when this reply was received Jagaraya made use of a thousand gentle expressions and promised honors and rewards. but nothing could turn him. Nay, Echama took the field with his forces and offered battle to Jagaraya, saying that, since latter had all the captain on his side, let him come and fight and beat him if he could and then the nephew would become King unopposed .... .... .... .... ....
The washerman delivered him (boy) up to Echama Naique .... .... .... and the boy was received by that chief and by all his army with great rejoicing .... .... .... ....

" Some of the chiefs were struck with horror, at this dreadful deed and were so enraged at its cruelty that, they went over to Echama Naique, and resolved to defend the prince. "

" Echama Naique entered in triumph the tents of Jagaraya, finding in them all the royal insignia belonging to the old king and these he delivered to the YOUNG prince .... .... .... proclaiming him rightful heir and king of all the Empire of Bisnaga " .... .... .... ....
" We know that in 1639, the king of Vijayanagar was named Ranga or Sri Ranga and he was at that time residing at Chandragiri; because in that year Mr. Day, the head of the English trading station at Madras, obtained from the King a grant of land at that place, one mile broad by miles long on which Fort St. George was afterwards constructed. The Country about Madras was then ruled over by a Governor or Naik and so litlle heed did he pay to the wishes or commands of his titular Soveriegn, that although the Raja had directed that the name of the new town should be " Sri Rangarayalapatnam ,, or (city of Sri Ranga Raya ) the Naik christened it after the name of his own father " Channa " and called it Channapatnam ".

పై చరిత్రాంశములన్నియును స్వ్యాచులుగారు శాసనములఁబట్టియు నప్పటికాలపు బాబుల సుబట్టియు వ్రాసినారు. వీనిని యుద్ధాంశములను జేర్చి రామకృష్ణపిళ్లెగారును నాచార్యులవారును వ్రాయు కారణ మేమో తెలియకున్నది. రాజసాహెబు మొనరించిన కూనుని నేరమునీఁబనికిమాలిన వానిఁగా జేసినకారణ మేమో తెలియరాదు. ఈ నాటకమునందుఁగల "విచమునీఁడు" విచయోరునిమూరుఁడయి మైసూరివారితో యుద్ధమొనర్చి జయమునంది "అబ్దుల్ బాదుషా" గారితో బహుమానమందిన కుమార విచమునీఁడు కాఁబోలు.

ఈ నాటకములోఁ గుముదినియను సాహపవంశురాలిని చాందుఖాకాయను తురుష్కసేనాధిపతినిఁ జేర్చితిని. వీరినిఁ జేర్చుటచేఁ చరిత్రాంశములకు లేలోపముఁ గలుగదు.

ఈ నాటకములోని గొన్ని పద్యముల నాచే రచింపఁబడిన యితరనాటకములోనుండి యెత్తి వ్రాసినాను. కారణము దేహానారోగ్యము.

ఇటని విన్నవించు.

కోలాచలం శ్రీనివాసరావు.

8-8-1916.

మరా:— ఈశ్వారాధనచే నాటకము ప్రారంభింపఁబడును గావున నాందియనవశ్యకము.

---



# చంద్రగిర్యభ్యుదయము

ప్రథమాఙ్కము - ప్రథమరంగము.

బ్రాహ్మణులైదుగురు - మార్కండేయశాస్త్రిలు - యాచమనీయుఁడు.

యాచమనీయుఁడు:—

సీ. శ్రీదేవి యెచట నాశ్రితకల్పవల్లియై
బంగారువాన నోసంగెఁ గరుణ
మాధవు లెచ్చోట మానవకోటిని
మాధవులుగఁ జేసి మనిచిరిలను
బుక్కరాయాదులు పూజ్యులై యెచ్చోట
రాజ్యమేలిరి రమారాజ్యమనఁగ
రాయలవారికర్ణాటరాజ్యంబని
శాణించి మించె నేరాష్ట్రమవని

గీ. అతులసకలాభిరమ్యతేఁ బటిమఁగాంచి
నట్టిపట్టణమాయిది? యక్కటకట
కీడుఁగని యెందుఁజూచినఁ బాడుపడియె
నుప్పరిగ లన్ని కూలెను తిప్పఁగుచు
గాలమహిమకు నేమనఁగలము మహిని.

(చింతించి) ఈ క్షేత్రమహిమ యెట్టిదియో, యెంత పాడుపడియుండినను, దాని సౌభాగ్యకళ యెట్టివారికిని, మనోహ్లాదము గలిగించుచున్నది? సౌరభరసాలఫలరసముబలె మధురమయి, మందగతిఁ బ్రవహించుచు, సురబృందమునకు సైతము సేవ్యమై చెలువొందిన యీ తుంగభద్ర సమస్తజనులకు భద్రప్రదమై, మానసామోదముఁ గలిగించుచున్నది. ఎందుఁ జూచినను నింద్రనీలమణిఖచితములై వెలయుశిలామండపములు గాంచఁ గనులకు నిండుపండువు గనున్నవి. విజయనగరరాజ్యమును, భద్రముగఁ గాపాడుచుండిన వీరభద్రుఁడును, శాత్రవహస్తిమస్తిష్కమును జీల్చి చెండాడుటయందుఁ గ్రసింహుండగు నుగ్రనరసింహుఁడును, కామాద్యరిషడ్వర్గముల నణంచి చిత్తమంతర్ముఖముగ నొనరించి శాంతమూర్తులయి సమాధియోగమును సాధించుచున్న యోగులంబలె స్థాణువులై నిలిచినారు. సాసువెగణపతియును శనగల గణపతియునుఁ దమకు భుక్తికిసిద్ధి జరిగెడు భక్తులు లేరైరే యని చింతించుచు దాద్యంత వహించినారు. హా. హా. ఆ రాయలవారిభాగ్య మెంతగనుండెనో! నేను వర్ణింప శక్యముగాదు.

ప్రపంచమున మంచి శిల్పవిద్యానిపుణులున్నట్లు సుమీఁగూర్చి రామాయణ కథారూప రూపకమును వేషధారులచేఁ బ్రదర్శింపఁబూనినటుల శిలావిగ్రహ ప్రాకారముగా హజార రామస్వామి యను నాటకశాలలో భిత్తికలను నే పద్యములపైఁ జెక్కించినారు. ఆ శృంగారమును జతుర్ముఖ పంచముఖులు వర్ణింపనలవియగునేమో నే నెఱుంగను. అటులనే యీ విఠ్ఠలరాయని దేవాలయములోని శిలారథ చిత్రనిర్మాణమును, నొకశిలలో సహస్ర స్తంభములు చెక్కిన శిల్పుల కౌశల్యమును ద్వారమున నుభయపార్శ్వములఁ జెక్కిన చిత్రలేఖయును, సహస్రజిహ్వలుగల శేషుఁడు వర్ణింపనలెగాని కేవలమానవమాత్రునకు వర్ణనాతీతమని నే నెన్నెద. మతంగ మాల్యవంత, హేమకూట ఋష్యశృంగాది పర్వతములు వృక్షహీనములయి విజయనగరసామ్రాజ్యమునుఁబోలె నిర్జీవత్వ మగుపడుచున్నవి. విజయనగర ప్రాభవమింకను సంపూర్ణముగ భీభత్సింపలేదని తెలుపుటకుఁ గాఁబోలు, తుంగభద్రలోని జీవనమిప్పటికి గంటినను మందమంధముగఁ బ్రవహించుచున్నది. నా కట్టెదుటఁ గన్పించు గోపురోన్నతి విష్ణుపదమునంటుచు నందున్న విరూపాక్షేశ్వరునిఁ జిత్తశుద్ధితో సేవించినవారికి స్వర్గలోకముఁ జేర్చు సోపానములు గలిగినట్లగనున్నవి. భీభత్సించిన యీ నగరవైభవమును జూచినట్టెల్లను నా మానసమున దుఃఖమంతకంతకు నతిశయమగుచున్నది. మానవులంబలె స్థలము నైకము, ప్రాగ్భాగమున కర్మననుభవింపఁదగినదని యీ స్థలము స్థాపించుచున్నది.

సీ. ఘోరాటవిగనుండి కుందెను గొన్నాళ్లు
కర్మఫలం బిది గాదె కనుమ
విద్యానివాసమై వెలసెను గొన్నాళ్లు
కర్మఫలం బిది గాదె కనుమ
భాగ్యాదినిలయమై భాసిలెఁ గొన్నాళ్లు
కర్మఫలం బిది గాదె కనుమ
ఇంబజీ యొకని మేషంబులోఁ బాడ్వాడెఁ
గర్మఫలం బిది గాదె కనుమ

గీ. మఱలఁ గర్మ ఫలాధిక మహిమఁ జేసి
సకలవిద్యాభివృద్ధిని సంపదాళిఁ
గనుచుఁ నీపురి సౌభాగ్యగరిమ నంది
యశము దిశలెల్లనించునో వశమె తెలియ?

నా. ఈ నగరమునకునై, నే నెంతగఁ జింతించినను నేమి ప్రయోజనము? ఇప్పుడు మధ్యాహ్నమైనది. వెంటవచ్చినవారిని, నతిదూరంబుననున్న కామలాపుర తటాకతీరంబున, వదలి వచ్చితిని. వైశమ్మె విరూపాక్షునదర్శించి, నమస్కరించి, మఱలవారినిఁ జేరికొనెదను.

( అనుచుఁ బాదరక్షలువదలి పాదములుదుడిచికొని దేవాలయమును సమీపించి విరూపాక్షునకు నమస్కరించును. బ్రాహ్మణులు దేవునకు బిల్వార్చనఁ జేయుచుందురు. )

బ్రహ్మశాస్త్రి:— [చేతిలో బిల్వదళములునించిన తట్టఁబట్టికొని]

బ్రహ్మమురారిసురార్చితలింగం నిర్మల భాసితశోభితలింగం॥
జన్మజదుఃఖవినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం॥

మృకండశాస్త్రి:—దేవమునిప్రవరార్చితలింగం కామదహన కరుణాకరలింగం॥
రావణదర్పవినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం॥

మార్కండశాస్త్రి:—సర్వసుగంధిసులేపితలింగం బుద్ధివివర్ధనకారణలింగం॥
సిద్ధసురాసురవందితలింగం తత్ప్రణమామి సదాశివలింగం

ఈశ్వరశాస్త్రి:—దక్షసుయజ్ఞవినాశనలింగం కనకమహామణిభూషితలింగం॥
ఫణిపతివేష్టనశోభితలింగం తత్ప్రణమామి సదాశివలింగం॥

శంకరశాస్త్రి:—కుంకుమచందనలేపితలింగం పంకజహారసుశోభితలింగం॥
సంచితపాపవినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం॥

చంద్రశేఖర:—దేవగణార్చితసేవితలింగం భావైర్భక్తిభిరేవచలింగం॥
దినకరకోటిప్రభాకరలింగం తత్ప్రణమామి సదాశివలింగం॥

గౌరీశశాస్త్రి:—అష్టదళోపరివేష్టితలింగం సర్వసముద్భవకారణలింగం॥
అష్టదరిద్రవినాశితలింగం తత్ప్రణమామి సదాశివలింగం॥

మృత్యుంజయ:—సురగురుసురవరపూజితలింగం సురవనపుష్పసదార్చితలింగం॥
పరంపరంపరమాత్మకలింగం తత్ప్రణమామి సదాశివలింగం॥

[బిల్వార్చనయొనర్చిమంగళహారతి యొత్తి ప్రారంభమునగర్భగుడికి వెలపల ధ్యానయోగమునం గూర్చునియున్న సదాశివ యోగికినిచ్చి సిదపయూచమునునడుపిత్తురు. వారుమంగళహారతిఁ బుచ్చుకొందురు. సదాశివయోగినిలిచి యీశ్వరునకుఁ గేలుమోడ్చి].

సదాశివయోగి.— మహిమ్నః పారంతే పరమవిదుషో యద్యసదృశీ॥
స్తుతిర్బ్రహ్మాదీనామపితదవస న్నాస్త్వయిగిరః॥
అథావాచ్యస్సర్వస్స్వమతి పరిణామావధిగృణ॥
న్నమాప్యేషస్తోత్రేహరనిరపవాదః పరికరః॥
అతీతఃపంథానంతవచమహిమావాఙ్మనసయోః॥
అతద్వ్యావృత్త్యాయంచకితమభిధత్తేశ్రుతిరపి॥
సకస్యస్తోతవ్యః కతివిధగుణఃకస్యవిషయః॥
పదేత్వర్వాచీనే పతతినమనః కస్యనవచః॥
మధుస్ఫీతావాచః పరమమమృతం నిర్మితవత॥
స్తవబ్రహ్మన్‌కింవాగపిసురగురోర్విస్మయపదం॥
మమత్వేతాంవాణీంగుణకథన పుణ్యేనభవతః॥
పునామీత్యర్థేస్మిన్పురమథన బుద్ధిర్వ్యవసితా॥

* మహిమ్న స్తోత్రం.

(అని మనమస్కరించి కూర్చుండును).

యాచమనీయుఁడు. [ఈశ్వరునకుఁ గేలు మోడ్చి]:

కలాభ్యాంచూడాలంకృతశశికలాభ్యాంనిజతపః॥
ఫలాభ్యాంభక్తేషుప్రకటితఫలాభ్యాంభవతుమే॥
శివాభ్యామస్తోకత్రిభువనశివాభ్యాంహృదిపున॥
ర్భవాభ్యామానందస్ఫురదనుభవాభ్యాంనతిరియం॥
గళంతీశంభోత్వచ్చరితసరితః కల్బిషరజో॥
దళంతీధీకుల్యాసరణిషు పతంతీవిజయతాం॥
దిశంతీసంసారభ్రమణపరితాపోపశమనం॥
వసంతీమచ్చేతో హృదభువిశివానందలహరీ॥
త్రయీవేద్యంహృద్యంత్రిపురహరమాద్యంత్రినయనం॥
జటాభారోదారంచలదురగహారం మృగధరం॥
మహాదేవం దేవం మయిసదయభావం పశుపతిం॥
చిదానందంసాంబంశివమతివిడంబంహృదిభజే॥

(శివానందలహరి)

(అనుచునీశ్వరునకునమస్కరించును బిల్వార్చనబ్రాహ్మణులు సదాశివయోగికినమస్కరించి వెళ్లిపోదురు.)

యాచమ:— [స్వగతము] దేవాధిదేవా! ఇదియేమినీచిత్రచరిత్రము? నీతంత్రయోగమునకొక్కనిమిషములో, నున్నవిగలువిప్పలయ్యెను. విప్పలువిప్పిగలయ్యెను. వైభవశిఖరమందిన యీ విజయనగము నేలఁగూలెను ఈరాజ్యము నీ యాజ్ఞచేగదా విద్యారణ్యులవారు బుక్కరాయాదులమూలకముగ స్థాపించిరి? ఆమహాత్ములుతమవిద్యాప్రభావమున నీస్థలమును విద్యానగరముగఁ జేయుటయుగాక తమతపఃప్రభావమున మూడుమున్నాళ్ళు గడియలు బంగారువానఁగురిపించి భాగ్యనగరమునుఁ జేసిరికదా? నీభక్తులుశాత్రవమదకుంజరముల పాలిసింహప్రాయులై వెలయుచుండిరికదా? వైదికాచారములవ్యాహతముగ జరుగుచుండెనుగదా? ఇటులుండిన రాజ్యమంతయును తాళికోటయుద్ధములో వజ్రధారాపాతమునబలె, నొకగడియలోమన్నుఁగలసెనుగదా? కృష్ణదేవరాయలవెనుకయసదృశపరాక్రమమునునిలిపినరామరాజు నిలిచినవాఁడునిలిచినట్లుగ, హతుఁడాయెనుగదా? ఒకగడియలోఁగర్ణాటకరాజ్యమే శీర్ణమాయెనుగదా! సాంబా! నీవు ప్రత్యక్షముగనుండియు నిట్టికడగండ్లనీభక్తులాపనుచుండ నీవుజూచుచుంటివిగదా? కాపుదలఁగనుంచినకంచియతానే పొలముమేసినచోఁ గావలివాఁడేమిసేయఁగలఁడు? భవానీపతీ! భక్తాభిమానియగు నీవునీభక్తులగు బ్రాహ్మణులను బాహుభుజాలను రక్షింపక, నీద్వేషులను నీమాలయధ్వంసకులును నాస్తికులుమగుములకలనునను గ్రహించుటకుఁగారణంబేమో తెలియదు నీయాజ్ఞలేక కడ్డియైననుకదలదుకదా? దుష్టనిగ్రహశిష్టపరిపాలకుఁడను బిరుదునీకెటుసార్థక

మియ్యెనో నేనెయుంగనే? ఈప్రాంత్యాదులం బడియుండు విగ్రహములు నేలంగూలి శవముల రీతిగం బడియుండుటం జూచినరౌడులు నా యొల్లసత్త్వము లేసి పాషాణములకంటె తోంపం జేయును. నీవు మనసులో నాకం డయ్యెదవు శంకరా! ఎన్నండో నీవు రావణుని తపంబునకు మెచ్చియాయసురునకు నాత్మలింగమిచ్చితివనియును మృత్యుభీతుండైన మార్కండేయునకు స్థిరాయువునొసంగితివనియును ప్రఖ్యాతి కలదు. నీ ప్రస్తుతస్థితినిం జూచినచో, నీకునట్టిమహిమయున్నదియా యనునది సందేహముగనున్నది. [అనికన్నీరుం గార్చుచుమందున్న సదాశివయోగినింగాంచి] బ్రాహ్మణోత్తమా! దైవబలము తప్పినచో నెవరేమి సేయంగలరు? రామరాజంతటి సాహసి రక్షించికొనలేని యారాజ్యమును నేనుమరల స్థాపింప సమర్థుండనగుదునా? ఈవృథాభిలాష నాకేల! భ్రష్టప్రతిజ్ఞుండనై నేనునరకార్హుండయినను చింతలేదు ఇదిగో, నాకరాలంకారమగు కరవాలము నీసమక్షమున నీ శంకరుని సరసనుంచెద. ఈ విరూపాక్షుని యానతిలేక మరలనే దానినంటను [అనుచునొఱనుండి కృపాణమును దూసిలింగము నెదుటం బెట్టును].

సదాశివయోగి:— శరాకవరా! శాంతము, శాంతము స్వజనమరణస్మరణముచే క్షుబ్ధమగు నీకోమలచిత్తవృత్తి శాంతపడ టకునై యా యభవుని శుభప్రదమగు దివ్యలింగమును గనుఱెప్ప వాల్పక, చూచుచుండుము కూర్చుండుము. నీవు వీరుండవుగను ధీరుండవుగను, నగపడియెదవు. శూలిపాణిని సాధించు మనోదార్ఢ్యమునీయందు నిశ్చయముగనున్నది. అంతకంటెను హెచ్చువనికి నీవిపుడుపోజనదు. (అనుచు దివ్యలింగము ప్రక్కన యాచమనాయకునిం గూర్చుండనియమించి శైవమును స్తుతింపసాగెను.)

" తవైశ్వర్యం యత్తజ్జగదుదయరక్షాప్రళయకృ
త్త్రయీవస్తు వ్యస్తం తిసృషుగుణభిన్నాసుతనుషు
అభవ్యానామస్మిన్ వరద రమణీయామరమణీం
విహంతుం వ్యాక్రోశీం విదధత ఇహైకే జడధియః
కిమీహః కింకాయస్సఖలుకిముపాయస్త్రిభువనే
కిమాధారో ధాతాసృజతికిముపాదానఇతిచ
అతర్క్యైశ్వర్యేత్వయ్యనవసరదుస్థోహతధియః
కుతర్కోఽయం కాంశ్చిన్ముఖరయతి మోహాయ జగతాం"

యాచమనీయుండు:— (శాంతచిత్తమునలేచి బ్రాహ్మణునింజూచి.) విప్రోత్తమా! దుఃఖావేశభరమున నానుండిసంభవిల్లిన ప్రమాదములను క్షమించి నాకు యోగ్యమగు మార్గమును జూపి రక్షింపం బ్రార్థించెదను. వచనమిచ్చినరీతిగ నా జనకుని వ్రతమును జరుపుట శ్రేయమా? అసాధ్యమగు పనినింబూని జనులహేళనకుగురియయి యీ శంకరుని సన్నిధిలోనుంచిన ఖడ్గము మరలంగైకొని యిష్టానుసారముగం బ్రవర్తించుట శ్రేయమా?

సదాశివయోగి:— కుమారవరా! ప్రారంభమునుండియు నీ మాటలు వినినేఁ గొంత యుత్తచిత్తుఁడనగుటయు యీనాఁటి మనవీరుల చిత్తవృత్తులు క్షణక్షణమునకు మాఱుచుండుటం జేసియని విచారపడుచున్నాను. మరణోన్ముఖుఁడగు నీ జనకుని వ్రతము సాగింతునని వచనమిచ్చితివి. ఇప్పుడే నశించిన విజయనగరమునుం జూచి దుఃఖించి నీ ఖడ్గము నీ దివ్యలింగము ముంగిట నుంచి ప్రతిజ్ఞా స్వీకారము నుత్సహించితివి. శివలింగమునుం గన్నులారఁ జూచి మహిమ్న స్తోత్రము నీవు లాలపించితివి, శాంతత్వమువహించి ప్రతిజ్ఞ పాలింతునా వలదా ” యని నన్నుఁ బ్రశ్నించెదవు. ఇట్టి చంచలవృత్తిచే నే కార్యము సాగును? నీ మాటలన్నియును విచారరహితములు. కావున నవిశ్వసనీయములనుటకు సంశయము లేదు. నీవు హిందువులను బోలక తురకలను మలకలని తూలనాడితివి. ఈశ్వరునియాజ్ఞ లేక కడ్డియైనను కదలదని మఱల వాడితివి. ఈశ్వరునిస్తుతించితివి. మఱల నిందించితివి. దేనియందును నీకు మనోదార్ఢ్యము లేదాయెను. ఈశ్వరతంత్రముఁ దెలియ నెవరి వశము? విజయనగరరాజ్యము స్థాపించినదియు నశింపఁజేసినదియు నీశ్వరతంత్రమేను. దైవతంత్రమువలన జరిగిన కార్యములకు భూషణదూషణము లేల? మనసుఖదుఃఖములకు దైవము కారణముగాదు. సమష్టిచే భూతకోటి సుఖానుభవమునకు దైవము ప్రపంచమును సృష్టించినాఁడు. మనకర్మానుసారముగ సుఖదుఃఖములు మనకుఁ బ్రాప్తించుచున్నవి. మానవాళిమత్తులై భోగములలోఁ జిక్కి దైవమును మఱతురు. అట్టివివేకభ్రష్టులకు సద్గతి దొరకదు. “ అర్చకస్యతపోబల ” మనురీతిఁ బూజించువాని తపోమహిమనుఁ బ్రతిమలయందు దేవత్వము స్థాపింపఁబడును గాని యట్టులేనిచో శాతివిగ్రహము పాషాణమేను. ఆవేశభరమున విగ్రహములను దూషించి తప్పొనర్చితివి. ప్రపంచములోని సకలురు దేవాంశజనితులు. జాత్యాదిభేదములు వ్యవహారోపయుక్తములు. ప్రపంచమొకటియైనను మానవులు తమవ్యవహారమునకు దానిని దేశములుగ విభజించి వేఱువేఱు నామములిడినమాత్రాన ప్రపంచమొకటియగాని వేఱు కాదు. అటులనే జాతిభేదములు. కావున దైవభక్తులగు తురకలను దూషించిన దోషమునకుఁ బోవలదు. ఇఁకనున్న దిరక్షించుట నీపని కాని నూతనరాజ్యస్థాపనము చేయుట నీపని కాదు. అది దైవముపై నాధారపడినది. ఆస్థితిఁడయి రాజనిష్ఠ గలవానికి ప్రతిఫలము తప్పక సిద్ధించును. ఇంతకంటె నీకు బోధింపఁదగినది హెచ్చు లేదు. ఇదిగో ఫలమంత్రాక్షతలు గొమ్ము. ( అనుచు ఫలమంత్రాక్షతలిచ్చును ) శ్రీవిరూపాక్షుని కృపచే నీకుఁ ద్వరలో సత్సాంగత్యము దొరకుటయగాక స్వామిభక్తి కుదురును. స్వామిసన్నిధియందుంచిన ఖడ్గమునందికొని రాజభక్తి నెట్లు ప్రఖ్యాతినిఁగనుము? ఇదియ నా యాశీర్వాదము. పోయి వచ్చెదను.

( యాచమనీయుఁడు నమస్కరించును. యోగి నిష్క్రమించును. )

యాచమనీయుఁడు:— ఈ బ్రాహ్మణునియుపదేశవాక్యము దీర్ఘాలోచనాయతఫలమని నాకుఁ దోఁచెడు. కావున నవశ్యానుసరణీయంబు. వాల్మీకిచే నతివిచిత్రముగ వర్ణింపఁబడిన పంపాసరోవరమునకుఁ బోయి యచటి చిత్రవిచిత్రములం గాంచి పంపాపతికి నమస్కరించి నాపురికిఁ బ్రయాణమయ్యెద. కరుణచే బ్రాహ్మణుఁ డిచ్చిన యాశీర్వాదపూర్వక

ఫలమంత్రాక్షతల నావస్త్రమునఁగట్టికొనియెద. (అనుచు ఫలమంత్రాక్షతలు వస్త్రములోఁగట్టికొని తనస్నేహితునిఁజూచి) ఓరీ! భద్రా! నీవుచైత్రమెక్కి కామలాపురమునకుఁబోయి యచట మనసేనలోఁ గొందఱినిమాత్రము పిలుచుకొని కిష్కింధసమీపమునను౦ను తుంగభద్రానదీతీరమున నుంపనియమింపుము. నేనుపంపాపతినిదర్శించి యచ్చటికివచ్చి చేరెదను.

భద్రుఁడు:— చిత్తము.

(నిష్క్రమము.)

## ద్వి తీ య ర ం గ ము.

### ఆది పంపావతిక్షేత్రము.

యూషమనీయుఁడు:— (స్వగ) హా! ఈ పంపాసరోవరతీరతరుఫల సౌందర్యంబు, నందన, వన, మందిరంబును నపహాసించుచుఁ, గనుబారి మానసమంథిరంబును హర్ష పూరితముగ నొనర్చును? ఈ యరణ్యంబు వర్ణింపనాలనమా? పరిపూరిత వానాఘఁ తరునికరశోభితంబు. బంధురతరకురువింద మందరాభిరమ్యంబు. మధురమాకంద బృందముల సౌందర్యసమేతంబు అనుంవానందకందళితహృదయానందంబగు నరణ్యంబు, మందారమాకంద మకరందరసధునీపూరంబు అనిందిత త్రిలోకవందిత త్రిపథానందంబగునందనవనంబిదియ యని తోఁపఁజేయుచున్నది.

సీ. కమనీయకల్హారకలహంసకలితంబు
విమలాంబుకాసారవిశ్రుతంబు
అందమాకురు విందమందార మహీతలంబు
సుందరమాకంద సురుచిరంబు
కంకేళికేతకీ కదళీకపిద్థంబు
కాంతకాంతలకును కాంచనంబు
మధుసుధారసపూర మధురాంబు సారంబు
నారికేళాదికనగయుతంబు

గీ. మందమారుత కంపితమానితంబు
కుందకుట్మల బృందోప సుందరంబు
నందనంబున కం బెనానందదంబు
నందమగు నౌర: యూవన మందిరంబు.

హా! ఈ పంపాసరోవరతీర సౌందర్యంబు రామావతారంబున నెంతటి హృదయానందకరమగనుండెనో అటుకాకేని రామాయణమునందు వాల్మీకిమహర్షి యింతగవర్ణించుచుండెనా? వానిని, ఖగకరకరకమ్రుఁడైన బాహాము మిలిమిలాయచున్నది. ఇచటనుండు పంపాసరోవర

వారినిఁ గ్రోలి మార్గాయాసంబుఁ దీర్చికొని, యీపి పంపాపతిని దర్శించెద. [ అనుచు నవతి దూరంబుననున్న ప పాసరోవరముల్లోనికిఁ దిగి నీరుఁ ద్రావివచ్చి ] హా. హా. ఈ సరోవర వారిపూరంబెంత రుచికరంబుగనున్నది?

గీ. సారవిస్తారతా సారవారిపూర
మధురిమమ్ముఁ జూడ మధురస మధురమెంత;
మధురమధు పక్వ మాధవీ మధుర మెంత
త్రిదశవర్యులకు నాహార మిడియ కదరా.

ఈ నిర్మలోదక పానంబున నా మార్గాయాసంబుఁ దీఱెను? ఇఁక దేవతాదర్శనంబుఁ జేసికొనియెద. [దేవాలయమును సమీపించును.] ఇది యీ స్థలమంతయు నిర్జనప్రదేశముగనున్నది. దేవాలయము జూడఁ బాడ్వడిన రీతిగ నగపడెను. గర్భగుడిముందు చిన్న దొకమంటపము మాత్రమున్నది. దేవాలయములో మిణుకు మిణుకుమనెడి యొకదీపముఁ దప్ప మఱి యేమియు లేదు. ఈ దేవునకు నర్చకులు నైరమున్నవారో లేరో తెలియకున్నది. అవియన్ని యుండునా యేల? దేవతాదర్శన మొకటి చేయుదము.

" నిత్యానందరసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్ద్విజసేవితం కలుషహృత్సద్వాసనావిష్కృతం
శంభుధ్యానసరోవరం వ్రజ మనోహంసావతంస స్థిరం
కిం క్షుద్రాశ్రయపల్వలభ్రమణసంజాతశ్రమం ప్రాప్స్యసి
ఆనందామృతపూరితా హరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్నము పేత్యభక్తిలతికా శాఖోపశాఖాన్వితా
ఉచ్చైర్మానసకాయమానపటలీ మాక్రమ్యనిష్కల్మషా

నిత్యాభీష్టఫలప్రదా భవతుమే సత్కర్మసంవర్ధితా"

[నమస్కరించి నిలుచును].

[లోనుండి కాలుచప్పుడగును అంతులోనుండి తలుపులు మూయఁబడును. ఈశ్వరునకు నభిషేక మొనర్చునపుడు చమక మంత్రము లుచ్చరించిన శబ్దము వినవచ్చును.]

ఇది యేమి చిత్రమో తెలియకున్నది. ఇంతకుమున్ను నేనీశ్వరుని గర్భగుడిలోఁ బ్రవేశించినపుడెవరును నచటనుండ లేరు. ఆగర్భగుడి చిన్నది. వేఱుద్వారము లేదు. ఈమంత్రములుచ్చరించు పురుషుఁడెచటినుండి వచ్చెనో తెలియదు. ఈ కిష్కింధగుహాలలో ఋషులయాశ్రమము లున్నవని వినియుంటిని. దానికడ చుడుగులుచటి భూత ప్రేతపిశాచములంధకారంబున సంచరించుచుండునని నాకుఁ దెలిపిరి. దీనిఁ జూడ భయంకరస్థలముగనున్నది నను బోలుభీరుఁ డట్టి భీతికిలోఁబడినగతి యేమి? నేనిచట నీరాత్రియుండఁ దలఁచినను వీలు లేదు. ఈ యాశ్చర్యోదంతంబెల్లఁ దెలియవలెను. ఏమి. ఏమి. అకారూపాతక దేవాలయము నందు బ్రాహ్మణోత్తముఁ

య్య మొనర్చునది నాకర్తవ్య-పవిత్ర కార్యము. నీనుండి రెండుతూరులు గెలువంబడి జీవముతో నిలచిన యీనా దేహము నీహితచింతనయందే సదాకాలముండును చాలును. హెచ్చుమాటలింకేల? నాపేరు చాందుఖాన్. విపత్కాలమున యాచమనాయకునకు సహాయపడని యీనాజన్మమువ్యర్థమగునుగాక. నాకు సెలవిచ్చినఁబోయివచ్చెదను.

యాచమ:— శూరాగ్రణీ! పోయిరమ్ము.

[చాందు నిష్క్రమణము]

దైవానుగ్రహమువలనిప్పుడోదవినజయలాభమునకు నాచిత్తమించుక హర్షించినను నాస్వజనమరణస్మరణ మాహర్షస్థానమంతయు నుంగలించి విషాద బీజముచటనాటుచున్నది. ఫలమంత్రాక్షతలనష్ట విచారము నామానసవిషాదమును హెచ్చింపఁజేయుచున్నది. ఆపంపాసరోవరదేవాలయ రహస్యమెట్టిదో తెలియవలెననుకుతూహలము నాకినుమడించుచున్నది. అదిభూతలీలయో ఋషుల మహిమయో నేనెఱుంగవలెను. నష్టమైననాఫలమంత్రాక్షతలమూటసాధింపవలెను. నేనిప్పుడింకదుండిచేయఁదగిన దేమియున్నది? ఆ పంపాసరోవరతీరమునకేపోయెదను.

[నిష్క్రమణము].

## చతుర్థరంగము.

### ఆదిపంపాపతి క్షేత్రము.

యాచమనాయఁడు - పంచమజాత్యర్చకుఁడు - భటులు నలువురు.

పూజారి:—( యాచమనాయకునిఁజూచి దండముఁబెట్టి ) ఎవరుసామీ మీరు. దయ్యాలాడునపుడు వచ్చుచున్నారు.

యాచ:— ఓరీ! మాదిదూర దేశము. స్వామిని దర్శించుటకు వచ్చినాము.

పూజారి:— ఈ వేళప్పుడు మాసామి దరుసనంకాదు. తలుపులు మూసికొనివచ్చినాను. ఇచట యీవేళప్పుడు బూతాలుపారాడుతావుసామీ మానిసియేదో యుటుండఁ?

యాచ:— ఓరీ! నీవేనా స్వామికినర్చకుఁడు?

పూజా:— అవునయ్యా! నేనేను. నే కాకపోతే బాపనోడయేడు దైర్యమూని యిస్సోటికిఁవచ్చును. వారిపనియంతయు వూరిలోనే.

యాచ:— ఓరీ! అసాదీ! ఈస్వామికి నీ వభిషేకమొనర్చి పూజింతువా?

పూజారి:— అయ్యా! పూజ నా తాతగారి కాలమునసే నిలిచినది. ఇపుడు దీపముపెట్టితే సాలునని దేవుఁడు మొఱపెట్టుతాడు.

యాచ:— అటులయిన లింగమునకు నభిషేకము లేదా?

పూజారి:— నే సేయడము లేదు.

యాచ:— మఱియెవరయినను జేయుదురా?

పూజా:—రాతిరియందెవరో బూతమో యక్షిణియో చేసినట్లున్నది?

యాచ:—భూతముగాని యక్షిగాని యిచ్చటను దివత్తుకో నీకు తెలియునా?

పూజారి:—నాకేమి తెలుసును సామీ! ఆ యుగపదు కిమికిందులో బూతాలు యక్షులు దయ్యాలు విసా సాలు వున్నావని నా నాయన్న చెప్పుచుండెను?

యాచ:—ఓరీ! దేవాలయమునకు ద్వారము తెరువబడియున్నది?

పూజా:—ఓకదేవయా! ఇప్పుడే వేసికమేసి తీగించివచ్చినాను?

యాచ:—ఆసాదీ! ఇదిగో యీ వంటకోలినిగొని నీవుపోపుము. నేనీరాత్రి యిచ్చటయుండి వచ్చుచు న్నాను.

పూజా:—( కంటికినొత్తికొని దండముపెట్టి ) వద్దుసామీ! వద్దుశబ్బా వద్దు. ఇచటనిలువవద్దు. మీవంటి తరుణపుఖులు బూతాలకిచ్చైతే రాటులు?

యాచము:—ఓరీ! అభయము నీకువలదు.

పూజారి:—పొద్దేరనిమాలాకుపో లేదో యని బీకవుగుంది.

యాచము:—ఆసాదీ! ఆ భీతినిక వలదుపొమ్ము.

( ఆసాది దండముంచి వెళ్లిపోవును. )

యా. వా. ఆనివలవునకు సాసాదివాండే యన్నిదండము. ఉరకుము. పర్యాంతర్యామియగు కర్పూరము హారతి చేసెదను నా? ఎన్ని వత్సరములుగనో యభిషేకము లేదట. సార్వకాలము ఇటాంటాటమున నాస్నాదిః నుం కొనినవానికి నభిషేక మెట్టి కావలయునా? దీపారాధన నైవేద్యము హెచ్చుగ లేదట! సర్వజ్యోతికి కోతుదీపమేల? భూతపతి యీ మాహేశ్వరుడు కావున భూతములిచట విహరించుచుండుట సహజమే.

( లోనుండి ఘంటానాదము వినబడును. )

(లోనుండి ఘంటానాదము వినబడుచున్నది.) ఎవరువాయిందురుండురు? దేవాలయద్వారములు బంధింపబడినవి. ఈ దిక్కునుండి యెవరునుపోరు. దేవాలయములోనికిలోవ వేఱు మార్గము లేదు. ఇది యేమో యచ్చెరువుగనున్నది. ఇదిగో యీ ద్వారములో నొక రంధ్రమున్నది. దీనిగుండ లోనజరుగు చిత్రములను జూచెద. (రంధ్రద్వారముగుండ లోదిక్కు చూచును.) యా. వా. ఎంతటిమహనీయుడో యితడు. వృద్ధబ్రాహ్మణుండుగ నగపడుచున్నాడు. పలితశిరోజములతోడి యీ వృద్ధుడనవలసినదిగ నున్నవాడు కాని దేహసౌష్ఠవము చూచిన ముప్పదియేండ్ల ప్రాయముగలవాడుగ నున్నవాడు. ఈతనిముఖవర్చస్సు జూడ నెవ్వడో దివ్యపురుషుడని నాకుదోచును. ఏమి విశాలవక్షస్థలము. ఏమి యాజానుబాహులు. ఈ పురుషోత్తముని సందర్శింపనైతి నేని నాజన్మమొక జన్మమగునా? ఎటులనైన దర్శింపవలెను? ఆ పురుషుని సాంబశివార్పణకావిమ్ము.

( కాలుగజ్జలధ్వనియును హారతిపారుమహాదేవయను ధ్వనియు వినబడును. )

ఉ. మానవవర్య! నీవిటు లమానుష కృత్యము లాచరింపఁగాఁ
బూనుట ధర్మమే? యఖిలభూతలమేలెడు పాదుషా యిటుల్
హీనులభంగి మానినుల యిల్వెడఁబాపుట పుణ్యకర్మమే
మానుము యిట్టిచేతలకు మానస మెప్పుడు నిన్ను వేఁడెదన్

చంప:— ఇది శూరవరుని ధర్మమా?

చాందు:— శూరునిధర్మము కాదుగాని సేవకునిధర్మమనుట నిశ్చయము.

చంప:— స్వగ॥ [ దూరమునకు వచ్చి ] ప్రస్తుపచయమునకని నా కృపాణము మఱచివచ్చితిని. ఏమి సేయుదును. [ చింత నభినయించుచు ] శూరవరా! అబలనని నన్నుఁ జేరఁ జాలకనఁజూడకు.

చాందు:— మత్తేభయానా! ఇట్టిమాటలచేఁ బ్రయోజనమ్ము లేదు. లాలనవచనమ్ములు నీకు రుచింపవేని బలాత్కారమే మిగిలినపని.

కం. లాలనయుతవాగ్జాలము
హాలాహలలీల నీకు నగునెటు రుచి హా!

చంప:— హాలస! కాలానలముఁ
గ్రోలుట మేలగునె వలదు కుమతంబులికన్.

శూరవరా! నాదులఁబట్టుట తీరుగాదు.

చంప:— కం. మేలా! యీ వాలాయము
కూళా! యింపగునె కాలకూటము మ్రింగన్.

చాందు:— బాలా! యీవచనము లికఁ
జాలును నినుఁబట్టి యిపుడె చనియెదఁ బురికిన్.

చంప:— శూరవరా అబలలను బలవంతులు బట్టినచో బలువంతలపాలగుదురు. దూరమాలోచింపుము.

చాందు:— నేనాలోచించితిని. బలవంతము దప్ప నాకు వేఱుమార్గము తోఁపదు.

చంప:— వీర్యాగ్రణీ! నీవు నన్ను బలాత్కరించి పట్టినచో నీకుదక్కునది ప్రాణములేని నా శరీరము.

చాందు:— శరీరమో! శవమో! పాదుషాగారికిఁ జూపుటనా పని.

చంప:— అదియా నీ నిర్ధారణము?

చాందు:— నిజము. అపిరేమి?

చంప:— ధీరవరా! నీకు యుద్ధధర్మములు తెలియునా?

చాందు:— పైగంబరుని శిష్యుఁడగు నాకు, యుద్ధధర్మములు తెలియవా?

చంప:— చూడుము నేను నిశ్శస్త్రపాణిని గదా?

చాంద:— నిజము.

చంప:— పరపురుషునితో స్త్రీమల్లయుద్ధముసలుపుట న్యాయవిరుద్ధముగదా?

చాంద:— న్యాయవిరుద్ధమేను.

చంప:— అటులయిన, శూరాగ్రణీ! నాతోయుద్ధభిక్షనిమ్ము. నాకొకకృపాణము నైననిమ్ము. నేనోడినచో నన్ను బట్టికొనిపొమ్ము.

చాంద:— (స్వగ). ఔరా! ఈస్త్రీసాహసము. నాతో శస్త్రయుద్ధము సలుపునట. ఆవినోదమిందుక యనుభవించెద. (అనుచునొకకృపాణమిచ్చును.)

చంప:— పురుషాధమా! రణమొనర్పుదము.

చం. అతిబలసంగతిన్ బలము నాజినిఁ గెల్చినరీతిఁ జూచితే
యతివలఁ గెల్వఁ? జాలు దురహంకృతి; యోపురుషాధమా! యిఁక
మతిఁగని మాన్యత స్థగుము, మానినుల న్పరియాదఁ జూడుమా
సతు లిల మానభంగమును జావని యెన్నుదు రంచు నమ్ముమా.

(బ్రాహ్మణుని ప్రవేశము.)

సీ. నాముద్దుతనయ యా నేమాయెనో యేల,
రాదాయెనో యెంత రాత్రియయ్యె
కాంతారమున దారిఁగానక చిక్కెనో
ఆ లెక్క తటి జాజి నేలఁబడెనో
వ్యాఘ్రభల్లూకాదివన్యమృగములకు భక్ష్య
మయ్యెనో యహిదష్టయయ్యెనొక్కొ
కాముకపంచనాక్రాంతయై చిక్కెనో
కారణం బిదియని కానరాదు.

గీ. వృద్ధుఁడగు నేను మార్గము వెదుకలేను
కానకెటుపోదు నాచిన్నదాని వార్త
యెటుల తెలియుదు, దైవమా! యెవరు నిక్కు
భారమా యెను మననీశరీరమునను.

చాందుఖాన్:— (పైరోదనమువిని బ్రాహ్మణుని సమీపించి) బ్రాహ్మణా! ఏవురివాఁడవు. ఎవరి నిచ్చి వెదకెదవు. ఏలయేడ్చెదవు?

బ్రాహ్మ:— అయ్యా! నేనిచటివాఁడనే; కొండగుహలో నివసించెదను. నాకూతురు చంప రాత్రి యయినను నింటికిరాదాయెను. కావున వెదకెదను.

చాందుఖాన్:— ఈ బిడ్డయేనా నీకూఁతురు?

బ్రాహ్మ:— నిజమయ్యా! ఆ బిడ్డయేను. (చంపను సమీపించును.)

చంప:—నాయనా? దూరముండుము? నే నీ కూరవరునితోఁ గృపాణయుద్ధ మొనరించి బ్రదికియుండినను, నినుఁ జేరెద.

చాందు:—ఔరా! ఈ స్త్రీ సాహసపరాక్రమములు (బ్రాహ్మణునిఁజూచి) బ్రాహ్మణోత్తమా! ఈ యువతి నీ కుమార్తెయేనా నిజముపలుకుము!

బ్రాహ్మ:—అయ్యా! ఆ చిన్నది నా సాకుడుబిడ్డ.

చాందు:—ఆ పిల్ల తండ్రిపేరేమి?

బ్రాహ్మ:—నరసింగనాయకుఁడు.

చాందు:—ఇపుడు మూడేండ్లక్రిందట మాకును హిందువులకును జరిగిన యుద్ధములోఁ జనిపోయిన హిందూ సేనాని నరసింగరాయఁడుగదా నరసింగనాయకుఁడు.

బ్రాహ్మ:—నిజము. అతఁడేను. అతఁడే కాంచననగరాధీశుఁడు.

చాందు:—ఈ పడుచు మీవద్దనెటు చేరెను!

బ్రాహ్మ:—కూరవరా! ఈ వనితతండ్రి యుద్ధమునకుఁబోవునప్పుడు తనబిడ్డను నావద్దవదలి బ్రాహ్మణోత్తమా! నేను తురకలతో యుద్ధమొనర్పఁబోయెదను, నా బిడ్డను నీ కడ వదలెదను. నీ బిడ్డగ రక్షించుచుండుము. యుద్ధమునుండి ప్రాణమునవచ్చితినేని నా బిడ్డను నేను పిలిచికొంపోయెదను. కాదేని యీ యువతిని ప్రతాపనగరమును వేంకటగిరికి గొనిపోయి యువానుఁడగు రూపసేనునకునిచ్చి వివాహ మొనర్పుము. చిన్నతనమునుండి వారిరువు రన్యోన్యప్రేమబంధమునఁ జెలఁగినారని వాక్రుచ్చిపోయెను. ఆ పిల్లరక్షణకొఱకై నేను వాలిపర్వతముచేరి గుహలో వసించుచున్నాను? ఇదే నిజమగు వార్త.

చాందు:—(కృపాణము దూరముపాఱవైచి చంపనుజూచి)

కం: దురితములొనర్చితిని; యో
తరుణీమణి! నీకు నేను దయ మదిఁగని, నో
దరుఁ డనినన్నెన్నుము; నీ
వరుఁడు సుహృద్వరుఁడు నాకు వరమతి! వినుమా.

వనితామణీ! నీవు నాకుఁ జెల్లెలవు. నీవు ప్రేమించిన రూపసేననాయఁడు నా ప్రాణదాత. రెండుతూర్లు నా ప్రాణమును రక్షించినవాఁడు. అతఁడిపుడు వారముక్రిందటనే యీ ప్రదేశము వదలి తనపురికిఁబోయెను. చెల్లెలా! తెలియక నీకు నేనొనరించిన తప్పు క్షమింపుము.

చంప:—అన్నా! క్షమించుటకును దండించుటకును నే నెంతటిదానను. చిన్నతనమునుండియు నేను హతభాగ్యను.

చాందు:—చెల్లెలా! చింతిల్లకు. (బ్రాహ్మణునిఁజూచి) బ్రాహ్మణోత్తమా! బ్రాహ్మణోత్తమా! ఈ వనితామణిని నీవిఁకఁగాపాడజాలవు. ఈ దేశమంతయును బాదుషాసేన నిండియున్నది. ఈ

యువతిని బట్టితేవలయునని పాదుషాగారి దిట్టమగు వాజ్ఞ. కావున నీవిక నిచటనిలచిన నపాయంబగును నీవు త్వరలో వేంకటగిరిఁజేరి యీ వారీమణిని యాచమనాయుని వద్ద మెునర్పుము. పెనుగొండదాటువఱకును మావారు నిన్నెవరును బాధింపనటుల నా నచ్చిన బంటులను గొందఱిని నీ వెంటఁబంపెద. ( చంపనుఁజూచి ) చెల్లెలా! పోయిరమ్ము. నే నింతకుమున్న నీకొసఁగిన కృపాణమ్ము నీ మానరక్షణమునకునై నీవే యుంచికొనుము. దైవానుగ్రహముండిన, శీఘ్రకాలములోనే నీ పునర్దర్శనంబగును. చెల్లెలా; నే నిచ్చినఁ బోయివచ్చెద.

చంప:—అన్నా! ఆపత్కాలమున నీవు నాకొనర్చిన యుపకృతి నేమనిన నంతవఱకును నే మఱవను. అన్నా! క్షేమముగఁ బోయిరమ్ము. ( చాలదుఃఖా విముక్తియుంచును. )

[ బ్రాహ్మణునిఁజూచి ] తాతా! ముహూర్తమెప్పుడు? ఈశ్వరుఁడుమము ననుగ్రహించెను? పోవుదమురమ్ము.

బ్రాహ్మ:—బిడ్డా! సర్వకార్యములకును దైవమేశరణము. పౌరుషమువ్యర్థము.

శ్లో॥ నేతాయస్యబృహస్పతిః ప్రహరణంవజ్రం, సురాస్సైనికాః
స్వర్గోదుర్గమనుగ్రహఃఖలుహరే రైరావణోవారణః॥
ఇత్యాశ్చర్యబలాన్వితోఽపి బలభిద్భగ్నః పరైస్సంగరే
తద్వ్యక్తంనను దైవమేవశరణం, ధిగ్ధిగ్వృథాపౌరుషం

[ నిష్క్రమింతురు. ]



# చంద్రగిర్యభ్యుదయము.

## ద్వితీయాంకము - ప్రథమరంగము.

చంద్రగిరిరాజాస్థానము - వృద్ధవెంకటరాజు - ఏచమనాయఁడు - జగదేకరాయఁడు ఓబళినాయక - తిమ్మానాయక - మకరనాయకమొదలగు సేనానాయకులనేకులు కూర్చునియుందురు. రాజకొమారుఁడు చిక్కరాయఁడు 14 యేండ్లబాలుఁడొకదిక్కునను రాజుగారియన్నకొమారుఁడు శ్రీరంగరాయఁడొకదిక్కునను గూర్చుని యుందురు వెంకటరాజు సేవకుల మెడపైఁ జేతులిడుకొని మెల్లమెల్లగ నడచివచ్చి మంచముపై గూర్చుండును ఆస్థానములోని వారందఱును లేచినిలుతురు తలవంచి యుందురు.

వృ॥ వెంకటరాజు:— (అందఱిని గూర్చుండుమనుచు హస్తముచే సంజ్ఞయొనరించి యించుకసేపూరకనే గ్రుఁడయి పిదపఁగన్నులు తెఱచి యందఱినిఁజూచి) ప్రతాపవంతులగు ప్రియ మిత్రులారా! విజయనగరరాజులసింహాసన విషయమునమీ ప్రేమనుఁజూచి పరమానందుఁడనైతిని. మీ పూర్వజులలోన నేకులీసింహాసనస్థిరత్వమునకై హితవరులై, రణరంగమున హతులయి వీరస్వర్గమునందిరి. ఈపవిత్రసింహాసనమునది, మీ మీ పూర్వికుల కీర్తినిదర్శనముఁ జేయుచున్నదని భావింపుఁడు. ఈజగతియందుఁగీర్తితప్ప మఱియేదియు స్థిరము కాదనునది మీరెఱింగిన విషయమేను? మీపూర్వజులవలెనే మీరును సింహాసనమర్యాదను గాపాడి కీర్తిశాలురగుదురని దైవమును గుఱించి నేప్రార్థించెదను ఈ సింహాసనమర్థిఁ బడఁగలువురాశించియుందురు. అయితే మా సర్వాంశపారంపర్యతను గాపాడు భారము మీపైనున్నది. దైవానుగ్రహమునుండియును, మీకృపాశయమునుండియును నేనిరువది యొనిమిదేండ్లు రాజ్యమేలి వృద్ధుఁడనైతిని. ఇఁక రెండుమూఁడుదినములలో శరీరము చాలింతును. మరణమందుదు నేయని నేనావగింజయంతైనను భయపడను. రాజ్యభోగమెటువదలిపోవుదుననునాశ లేశమాత్రము నాయందు లేదు. ప్రియ మిత్రులారా! జనులను, సమస్తబాధలనుండియు ముక్తులనుజేసి. యూర్జితఫల భోగానుభవమునకును సాహసముండుటకును, నాత్మను, దేహబంధనమునుండి వదలించు మరణరూపకసన్మిత్రునకు మనమేలభయపడవలెను! స్వంతపౌరుషమునుండి స్వర్గాద్యధికతరభోగములందు యోగ్యతయాత్మకునుండునపుడు క్షుద్రరాజ్యభోగా

రెడ్డి:— అటుకాదయా యిచట నెవరును లేరు. నేనెవరికిని దెలుపను. చెప్పవయ్యా!

కరణం:— అంతగాఁబలిమాలుకొనుచున్నావు కావున తెలిపెదను వినుము. జగరావుగారి బిడ్డ బాయమ్మగారు కదా మనరాజుగారి ప్రేమాస్పదయగు రాణిగారు?

రెడ్డి:— అవును. నిజము.

కరణం:— ఆరాణిగారు బహుదినములు పుత్రులు లేకయుండిరి కదా? పుత్రులఁగాను వారు కష్టవ్రతములు సలుపుచుండిరి కదా?

రెడ్డి:— నిజము.

కరణం:— మన కేశవశాస్త్రులవారి భార్య ఛాయమ్మ బాయమ్మగారివద్ద నుండును కదా?

రెడ్డి:— ఓ హెూ! అమ్మో! పిల్లలఖట్టి. ఎప్పుడున్ను గడుపుతోనే యుంటున్నది.

కరణం:—మన బాయమ్మగారా ఛాయకు ధనమిచ్చి తాము నీళ్ళు పోసికొనియుండినవారింబలె నటించి యామె కనిన తోడనే యా పిల్లవానిని దెప్పించుకొని యాపిల్లవాఁడు తాముగనినాఁడని ప్రకటించిరి.

రెడ్డి:— ఏమి ఏమి! ఇదియా సమాచారము. మనరాజుగారికి నీ సమాచారము దెలియదా?

కరణం:—మనరాజుగారేమి సామాన్యులా. నీటిలోఁ జాపలాపట్టువారు. వారికిఁ దెలియకయుండునా?

రెడ్డి:—అటులయిన దానిని వెల్లడి చేయక రాజుగారిన్ని దినంబులేల యూరకయుండిరయా?

కరణం:—రాజుగారికి బాయమ్మరాణిగారిపైఁ బ్రీతియధికముగనుండినందున వారిమనము నొప్పింప రాదని మిన్నకయుండిరి.

రెడ్డి:— అవునయ్యా! ఉండును. కాదేని “సద్వంశపారంపర్యము సద్వంశపారంపర్యము” అనిపలు మారునుడువుచుండ లేదు. అయ్యా! కరణం; మనజగరాయలవారు తమవంశమునకుఁ బట్టము లభింపలేదని యేమేమి కలహములు పెంచుదురో కదా?

కరణం:—కలహములు పెంపక విడుచువారా వారు? ఈదిక్కున కూరులగు యాచమనాయఁడుగారేమి మిన్నకయుందురా?

రెడ్డి:— ఇదియనర్థములకుఁ గారణమాయెను. మన కేలయీజోలి. రమ్ము పోవుదము.

[ నిష్క్రమము. ]

తృతీయరంగము.

శిబిరము.

యాచమనాయఁడు - బ్రాహ్మణుఁడు - కుముదిని - భటుఁడు.

ఉ. అంగనఁజూచుకాంక్ష మనమందు జనింపఁగ నేనువచ్చితిన్
దొంగఁగ వేఁచి రాజునకుఁ దొండ్రయేమి యొనర్చునో, ఖలుం

డంగగు రాజ్యభోగికిని నాకరవాఁగద నేమిలేమి! ప్రో
వంగలశూరుఁడొక్కఁడును బట్టణమందును జూడలేడయేఁ.

అదిపంపాపతి దేవాలయమున సేఁగనులాసంగసిన యాయంగననుఁజూచు కాంక్షమనమున ముప్పొంగ నాస్వామిసదిప్పుడే నేనిఁగనా నర్చిరంగ్రనిరివదలివచ్చితిని. నామనమేమో కళవళ పడుచున్నది. అఖిలుఁడు అగరావుఁను తపమున్నమునిఁకిక్కరాయని బట్టమునఁగూర్చుంచఁబెట్టను. రాజునకుఁగీసుపరుఁపకపోను. పాపభీరుఁడయినట్టియు స్వకీస్వభావుఁడయినట్టియు రాజా పైనకుటిలములు వెలిపుఱచి వానిని నివారించునంతటిసమర్థుఁడు కాఁడు. కావున నిట్టి కాలమునఁబంగ్రనిరివదలుట శ్రేయస్కరముగాదు. అవటికిఁబోవలెను. (ఆలోచించి).

ఉ. ముద్దియగోము మోహపసముం జెను మోహావుసీరథిగ్గటా
నిద్దుర రాదు కన్నులకు నిక్కముగా మఱివచ్చె నేనియుఁ
ముద్దియరూపు స్వప్నమున ముంగిటనిల్చినలాగుఁదోఁచెడుఁ
సుద్దులఁ కేల యాసుదతిఁజూడక గూడక నిల్వ నే భువిన్.

అసుందరాంగి సౌందర్యంబు నాకంటికిఁగట్టినట్టయి నాకు సముచుఁ పంచత్వమును జెందు చున్నయది. ఈమానసచాంచల్య దోషమునుండి నేనెపుడెప్పుడు పశ్చాత్తాపమునఁ బొగులుచుయుగు చున్నాను. వీరూపాక్షదేవాలయమున నా బ్రాహ్మణుఁడు నా హృదికి దోషమారోపించెను. డోలాయమానంబయినది నామానసఁపు (ఆలోచించుచుండును.)

(భటుఁడొకఁడు ప్రవేశించి)

భటుఁడు:—మహాప్రభూ! ఒకవృద్ధ బ్రాహ్మణుఁడును కొకనితడును ద్వారంబున వచ్చి గాచి యున్నారు

యాచమ:— భటా! త్వరలో వానిని లోనికిఁబంపుము.

(బ్రాహ్మణుఁడును దంపతులనువత్తురు).

[బ్రాహ్మణునకు యాచమనాయుఁడు నమస్కరించును]

ఉ. భూతదయాసుశీలనుత భూరితపోధన, దీనబాంధవా
యాతతమైనమీయ సుకృతాయత పుణ్యఫలంబుఁబంచె, మీ
పూతపదాబ్జ రాగపరిభూషితమద్గృహము య్యెఁగావునన్
నీతివిశారదా! ద్విజవరా! యభివందనమాచరించెదన్.

బ్రాహ్మ:— కం. యాచమనాయక; ధర్మము
గాచుచు ధీరత్వమూని గాంచుమయశముల్
యాచకకోటికి నిధివై
ధీచతురుఁడవగుచు మనుము దీర్ఘాయువుగాన్.

( యాచమనాయుఁడు బ్రాహ్మణునొక పీఠముపైఁ గూర్చుండఁ బెట్టును )

బ్రాహ్మ:— (పీఠముపైఁగూర్చుండి) బిడ్డా! చంపా! ఇటురమ్ము. ఈ పీఠముపైఁ గూర్చుండుము. (నాయకుఁజూచి) యాచమనాయకా: ఈకన్యనుగనుము. ఇదినీవస్తువు. దీనినిస్వీకరించి నన్ను ముక్తునిఁ జేయుము.

(యాచమనాయఁడా యువతినిఁజూచి యాలోచన నభినయించును)

వీరశిఖామణీ! నిన్ను సంశయగ్రస్తునిఁజేసినొప్పింపను. ఈకాంత కాంచనగిరి యధిపతిగనుండిన నరసింగనాయకుని కూఁతురు. ఈమె, నిజముగుపేరు మోహిని. నరసింగనాయకుఁడు తురకలలో విజయనగర ప్రాంతమునబోరునపుడీ తరుణినిరక్షింప నావశపఱచెను. తానుహతుఁడయ్యెనేని నీచిన్నదానిని రక్షించినీహస్తగతను జేయుమని నాచేవాగ్దానమందెను. ఆధీరుఁడు పోరున హతుఁడయ్యెను. ఈచిన్నదానిరక్షణమునకునై కొండగుహలలోఁజేరి నచటికెవరును రానటుల చిత్రవిచిత్రములుగ భూతలీలలు సలుపుచుంటిని. ఈరీతిమూఁడు సంవత్సరములు జరిగెను. ఇప్పుడుకొన్ని దినంబుల క్రిందట చాందుఖాను మను తురకసేనాని యరణ్యంబున నీతరుణినింజూచి బీజాపూరు పాదుషాసరసకుఁగొని పోవయత్నించుచుండ, నాకస్మికముగ నేఁగని యాతనిని బలిమాలుచుఁ బ్రస్తావవశమున నీపేరెత్తితిని. నీనామాక్షరములతనికి మహామంత్రబీజాక్షరములుగఁ బరిణమిల్లెను. వెంటనే యీచెలువను దనచెల్లెలుగ గౌరవించి తన రక్షోభటులనిచ్చి యిచ్చటికిఁబంపెను.

యాచమ:— హా. హా. మైత్రియన నిటులుండవలదా? ఏజాతివాఁడునుగాని మిత్రుఁడు మిత్రుఁడేగదా?

బ్రాహ్మ:— ధీరాగ్రణీ! నిజము. అన్యజాతికిఁ జేరినను నతఁడు గొప్పవాఁడు. నీకుసుహృద్వరుఁడుగనుండఁదగినవాఁడు. నీవంశజులు సామాన్యులుగారు. గోబ్రాహ్మణపరిపాలనమునకునై యనంతసాహసము లొనర్చినవారు. నీవో యాసద్వంశాబ్ధిచంద్ర ప్రాయుఁడవు. ఈ మోహినిసైతము సామాన్యస్త్రీ కాదు. సత్కులప్రసూత. సద్గుణస్వభావ. సత్సంగసుశిక్షిత. అసమాన సౌందర్యసహిత. ఇట్టితారుణ్యహితయగు వనిత పాణిగ్రహణమునకు నీవేదగినవాఁడవు. కావున నీతరుణినిఁ బరిణయమాడి సర్వసుఖములను శాశ్వతకీర్తియు నందుము.

యాచమ:— బ్రాహ్మణోత్తములారా! మహామహిములగు మీరు మముఁబోలు పామరుల నుద్ధరించుటకు నహోరాత్రములు యత్నించుచుండ దమయానతిని జవదాఁటనెవరు సమర్థులగుదురు? అనేకశతవత్సరంబులు తపంబొనర్చినను, మోహినిలభించుట దుర్లభము. పెద్దలయనుగ్రహముచే, దుస్సాధ్యకార్యములు సుసాధ్యములగునను సిద్ధాంతమిప్పుడు ప్రత్యక్షానుభవమునకు వచ్చెను. అనంతజన్మములెత్తి తపశ్చరణములాచరించినను తమరొనరించినయుపకృతిఫలముందఁజాలదు. ఈ తరుణి, తురకలకుఁజిక్కి శరీరత్యాగమొనర్చెననివిని, నేనుబరిణయాపేక్షఁబరిత్యజించియుంటిని. ఆవిరూపాక్షదేవాలయమునఁ దమసమక్షమందున్న మోహినినిఁజూచి నామానసము చంచలతనొందెను. నేనపుడే తమ పావనచరణదర్శనమొనర్చియుండినచో వృద్ధులగుతమకింతటి ప్రయాసమునొనరింపఁగారణముండక పోవును. స్వామి! మమ్ము క్షమియింపవలెను. శిష్యునికైదండయుంచి సమీపమునవున్న సా

యాచమ:— (కుముదినిం జూచి) మోహినీ! కాంచనగిరియందు నీతలిదండ్రులుండునప్పుడు నేను పలుమాఱు నీయింటికి వచ్చి నీతో నాడుచుంటిని. అపుడు నీవు బాలవు. కాలము గతించెను. కాలవిపర్యయంబు తటస్థించెను. మనయిరువురికిని ప్రాయము ప్రాప్తిల్లెను. కూరుఁడను పురుషుఁడను నాచెలికాడయ్యెను. ప్రీదయను చానినీ చెలియయ్యెను. మనకువీరుదప్ప మఱెవరును లేరైరి. గురువులవారి యాజ్ఞ చొప్పున నింకను బదిదినములవఱకు మనకు దాంపత్యమైత్రి కలుగ నేరదు. మనయింటికి మనమే పెద్దలము. ఈ దిన మిచట నేయుండి రేపటిదినము ప్రతాపదుర్గమునకుం బోవుదము.

కుముదిని:—పురుషవర్యా! నీ సేవకురాలను నేను. నీ యానతిరీతినుండెదను.

యాచమ:—వనితారత్నమా! నీవు నాకు స్నేహితురాలవుగాని సేవకురాలవుగావు. రమ్ము. శిబిరములోనికిం బోవుదము ప్రొద్దెక్కినది.

(నిష్క్రమణము.)

## చతుర్థరంగము.

### చంద్రగిరియాస్థానము.

రాజు చిక్కరాయఁడు - నరసరాజు (మంత్రి) - మేకరనాయక - జగరావు

వీరనరసింగ - అరుణాచలం - నాయకుల నేకులు - భటులు.

(శ్రీరంగరాయుఁడు సింహాసనముపైఁ గూర్చుండి.)

ప్రియమిత్రులారా! అనర్థమూలకముగు దొరతనము నాకువలదని నేను చనిపోయిన వెంకటరాజుగారిని మీ సముఖమునందు ప్రార్థించితిని. వారాగ్రహపడి నాశిరసుపై రాజ్యభారము బలవంతముగ మోపిరి. మీ రందరును రాజ్యము స్వీకరింపుడని నాకుబోధించితిరి. కావున నిపుడు రహస్యముగ జరుగు రాజద్రోహకార్యముల నెల్లనణంచి రాజద్రోహుల శాసించుభారము మీపైనున్నది. మా పక్షమూనిన, నాయకుల నేకులు జగరాయని తంత్రములకు లోఁబడి యతనికి సహాయపడుచున్నవారని వినుచున్నాను. రాజధానికివచ్చి పోవువారిని శోధించి కొందఱిని హింసించుచుండుట రాజునకు నెంతటి యవమానమో మీరే యోచింపుడు. చంద్రగిరి రాజ్యభారము ప్రస్తుతము నాపైనున్నది. ఇట్టి యరాజకస్థితి తటస్థించినపుడు మా ముఖ్యమంత్రులయిన యీ నరసరాజుగారును సేనాపతులైన యీ యరుణాచలముగారును వారిని దొలంచుట కర్తవ్యముగనుండును. ఇపుడు క్షణమైనను విలంబ మొనర్పక రాజద్రోహులను శాసింపవలెను. ఈకార్యమునందు సాహాయ్యపడనట్టివారు రాజద్రోహులేను. పేరుసంజేరి కత్తరించునది శౌర్యమునకును క్షాత్రధర్మమునకును న్యూనత. శాత్రవుల పక్షమూనువారు తమయిష్టము స్పష్టముగఁ దెలిపి, యీయాస్థానమును వదలిపోవగును. రాయలవారి సింహాసనమునందు నిష్కళంకముగు

విద్యగలవారు, రాజద్రోహులగు వైరుల శాసింతుమని వాగ్దానమిచ్చిరి నీ చేతి పంచిన తాంబూలమును స్వీకరింపుడు.

(రాజపక్షమవలంబించిన నాయకులుకొందఱు తాంబూలమందుదురు. నరసరాజును నరుణాచలమును తాంబూలమందుకొనక లేదివోకను గూర్చుండియుందురు.)

నరసరాజు:—( లేచినిలిచి ) రాజుగారూ! రాజద్రోహవిషయమున నేనును సేనాధిపతి యరుణాచలమును బూటకాప్రులమని తెలియుటసహజమే. ఈ సింహాసనవిషయమున నందఱింబలె మాకును నభిమానముకలదనుట నిస్సందేహము. అయితే, ప్రస్తుతప్రసంగము విచిత్రకరముగనున్నది. సింహాసనమునకు నిరువురధికారులుగనున్నవారు. వెంకటరాజుగారి యౌరసపుత్రులొకరు. వెంకటరాజుగారు మరణోన్ముఖులయినప్పుడు వారివద్దనుండి రాజచిహ్నములు స్వీకరించినవారు మఱియొకరు. ఈరీతిగ సింహాసనబాధ్యతకు రెండుశాఖలేర్పడియుండ, మంత్రియేమిసేయును? సేనాధిపతియేమిసేయును? ఈ ద్వివిధశాఖలనుగూర్చి క్షణక్షణము జనులమానసములు చాంచల్యమునుబొందుచున్నవి. కావున నీ సింహాసనబాధ్యతయొక్క బలాబలములు నిర్ధరించుపట్టున నుభయరాజులవాదములును నుచ్చరించినచో బాగుగనుండెను. ఈ తాంబూలగ్రహణాది డాంభికకృత్యములకు మార్గము లేదు.

[ రాజపక్షమవలంబించిన కొందఱు నాయకులు లేచి ]

ఒకనాయకుఁడు:— ఏమి! రాజుగారిది డాంభికకృత్యమా? మఱియొకతూరి యీ మాటయాడినచో జిహ్వ రెండుతునియలుగఁ జీల్తుము. [ అనుచుఁ గత్తులెత్తుదురు. ]

శ్రీరంగరాజు:— నాయకులారా! నెమ్మదిగనుండుఁడి. తాలిమిపూనుఁడి. నరసరాజుగారతిప్రసంగభాషణములు పలుకనిచో బాగుగనుండెను. సింహాసనమెదుటనిలచి రాజుమాట నిషేధించుటమహాపరాధమని మంత్రియని పేరొందిన నరసరాజుగారెఱుంగవలసినదిగనుండెను. ప్రస్తుతస్థితినిబట్టి యపరాధులను శిక్షించుటకై నేను మౌనముండుటయుక్తము. కర్తవ్యకార్యంబు ముగిసినది.

[ జగరావు వకీలు మాయణ్ణప్రవేశించి రాజుగారికి వందనంబులిడి ]

వకీల:— మహాప్రభూ! నేను జగరావుగారి న్యాయవాదిని. జగరాయలవారొకజాబు తమకునందింపుమని యిచ్చినారు ఇదియువారిజాబు.

[ వెంకోబరావందికొనును. ]

శ్రీరంగరాజు:— వెంకోబరావు! ఆ జాబునుచదువుము.

వెంకోబ:— చిత్తము. [ జాబునువిప్పి చదువఁ బ్రారంభించును. ] మహారాజుగారూ! వెనుకజరిగిన దర్బారులో వెంకటరాజుగారి కడుపునఁబుట్టిన కొమారుఁడయిన చిక్కరాయని బక్షమూని నేనును తిమ్మానాయక మకరినాయకులును దర్బారునుండి వెడలిపోతిమి. ఆదినమునుండియు నడిచినదానిని మేము రాజద్రోహకృత్యము లనేకములొనర్చితిమి. ఇప్పుడు మేమొనరించిన కృత్యములన్యాయములని మేమే యెఱింగితిమి. కావునఁ బశ్చాత్తప్తులయి దొర

చ. ఏంతటిబుద్ధిజాడ్యుఁడవు హీనపరాక్రమ! నీవురాజవే!
యంతకుపెట్టెకెన్ననుచు నాధరణీపతి వేంకటాధిపుం
డంతరువెంతయున్గనక, యారసుఁడుండఁగ, నీకు రాజ్యముం
భ్రాంతి నిఁజిక్కియియ్యఁగనె, ప్రాజ్ఞులుపాడియటంచు నెంతురే
స్వాంతమునందు, ద్రోహి! యదిసమ్మతమేకొనుచున్సుఖింపఁగన్.

జగ.— ఓరీ! బుద్ధిహీనా! నీవు రాజవా! ఆయహంకారమునీకేఁకనుగలిగియున్నదియా! మతిభ్రష్టా! నీవు నాకుసేవకుఁడవు. అవ్యక్తశక్తిచిత్తుఁడయి ముదిమదితప్పి మరణోన్ముఖుఁడయినతండ్రి నా వెంకటరాజుముద్దుటుంగరము నీకిడెనని యంచెప్పెదవా? నీ యుబ్బుదించెద. [మకరనాయకునిఁజూచి] మకరనాయకా! ఈచాండాలుని సతీసుతసహితముగఁగొనిపోయి చెఱనుంపుము. అడ్డపడిన వారినిసద్దుసేయకఁ జంపుము. [నరసరాజునుఁజూచి] నరసరాజుగారూ! నేటినుండి బాలుఁడగు చిక్కరాయఁడేరాజనియుందఱును వానికిసాహాయ్యపడక వెనపియున్న సందులఁదప్పినవారు రాజద్రోహులనియును నాజ్ఞాపత్రికలు వేవురయ గాక చాటింపుడు. అటులమాపురికై కాపురణమునకైనఁ జేరనటులనలుదిక్కులసేననుంపుడి.

నరస:— జగరాయులవారూ! ఈమునయుద్యముపాలివృత్యృ్యపుగ యాచమునాయఁడున్నవాఁడు. వాని విషయమునేమియొనర్చితిరి?

జగ:— వానిమదమడఁపయుక్తి పన్నినాను. వెనుకనుండి తెలిపెదను.

మక:— [రాజును వెఱుఁగొనిపోవును.]

శ్రీరంగరాజు.— [కన్నీరుఁగార్చుచు.]

సీ. రాజయిచింతచేరోజుచుండఁగనేల?
భోజనంబునకింత భూమిఁగనఁడె?
ధారణీధవుఁడయి తపియింపఁగానేల?
దారిద్ర్యుఁడీ ధరఁదనివిఁగనఁడె?
క్షితినేలిక్షాత్రవ తతికిభీతిలనేల?
నిరుపేదనిర్భీతి నిదురఁగనఁడె?
ఇలకునేలుచుచాలఁగలిమిఁ గోరఁగనేల?
యిలనుదున్నెడువాఁడు కలిమిఁగనఁడె?

గీ. దొరతనమునీవునవె యుండుదుఃఖతమము
ధరణిపాలురభోజ్యము దురితతనుము
అన్నిఁదెలిసియు మూర్ఖుఁడ్నై తినకట
రాజగుటఁకంటె బిచ్చాలరాజుమేలు.

[నిష్క్రమి.]

తిరుమల:—స్వామీ! రాజద్రోహులుండఁగ నపుడు రాజుగారికి క్షేమం బెటుగలుగు

యాచమ:—తిరుమలా! రాజుగారి క్షేమము మనకు నేమిఁకొంటెఁతగలిగెను?

తిరుమల:—సర్వమును గోలంతరయేను.

యాచ:—వారిపుడెచట నున్నవారు?

తిరుమల:—చెఱలోన.

యాచ:—ఏమి. ఏమి! చెఱలోనున్నవారా?

తిరుమ:—సతీ సుతులతో సైతము.

యాచ:—(నిట్టూర్పు విడుచుచు బ్రాహ్మణులఁజూచి) ద్విజోత్తములారా! పరిణయకార్యంబు శ్రాద్ధకాలములోఁ బ్రారంభించితిమి. కల్యాణోత్సవ మిపుడు చాలింతము. (తిరుమలునిఁజూచి) తిరుమలా! రాజుగారినిఁ జెఱలో నెవరిడిరి?

తిరుమల:—మఱెవరిదుదురు. ఆ ద్రోహి జగ్గరాయఁడు.

యాచ:—మనవారలందఱు నపుడు నిద్రించుచుండిరా?

తిరుమ:—లేదు. లేచియుండిరి.

యాచ:—అటులైన నా ద్రోహిని నెదుర్పఁజాలరైరా?

తిరుమల:—ఈ ఘోరకృత్యమున మనవారసేనలు వానికి సాహాయ్యపడిరి.

యాచ:—మన నరసరాజచట నుండలేదా?

తిరుమ:—వారును నరుణాచలమును బెట్టినకుంపటియే యుని.

యాచమ:—అదిఱెటులఁ?

తిరుమల:—రాజుగారు దర్బారొనరించి రాజనిష్ఠలగువారు తమవద్దనున్న పళ్లెరములోని తాంబూలమును స్వీకరింపుడని యాజ్ఞయిడిరి. కొందఱు తాంబూలమును స్వీకరించిరి. నరసరాజుగారును అరుణాచలముగారును స్వీకరింపరైరి. ఇరువురు రాజులంగ నేర్పడిన కాలమున వారివారికి నిష్టమువచ్చిన రాజుపై రాజనిష్ఠగలవారగుదురని నరసరాజుగారు బదులిడిరి.

యాచమ:—హా, హా. ద్రోహీ! నరసరాజా! వెంకటరాజులవలన నున్నత పదవినందిన నీవా యింతటి ద్రోహివైతివి? దీనికి ధనమే కారణమని నాకుఁదోచెను. మంచిది. తిరుమలా! ఆ నీచుని నగరులోఁ బ్రవేశింపఁజేసినవారెవరు?

తిరుమల:—మోసమొకటి. రాజుగారి నిష్పాపట్యమొకటి.

యాచమ:—మోసమెటుజరిగెను.

తిరుమ:—ఆ ఖలుఁడు జగ్గరాయఁడు తానును తన పరివారజనులును రాజద్రోహులమనియును రాజుగారి క్షమాపణమును వేఁడుటకయి వారి చరణసన్నిధికి, నభయదానమిచ్చిన వచ్చెదమనియును జాబునంపిరి. రాజుగారు దానినినమ్మి లోనరాను నాజ్ఞయిడిరి. వారు సేనతోవచ్చిరి. రాజుగారిసేన, యరుణాచలముగారి యానతిరీతిని రాజుగారికి సాహాయ్యపడక కాందిశీకులైరి.

రాజుగారు పట్టుబడిరి. బాయమ్మగారి పుత్రులు రాజులైరి. మనరాజుగారు కుటుంబసమేత ముగఁ జెఱపాలైరి.

యాచమ:— హా. హా. రాజద్రోహమింతగనుండునా? (దుఃఖించుచుండ ముద్దు రంగానాయకుఁడు యాచమనాయనిఁ జంపఁ గత్తియెత్తుచుఁ బోవుచుండఁ గుముదిని తనబాకుతో వెనుక నుండి ముద్దురంగనిఁ బొడుచును. ముద్దురంగడు. హా చచ్చితినని పడును. )

యాచమ:—( చూచి ) హా. హా. ద్రోహము. ద్రోహము. ( రంగానాయకునిఁజూచి ) ఓరీ ద్రోహీ! నిన్నిచ్చటికి నెవరుబంపిరి? ఈ ద్రోహబుద్ధి యెవరుగఱపిరి?

ముద్దురంగఁడు:—( క్రిందపడి గాయమునొప్పిచే బాధపడుచు ) యాచమనాయకా; ఆ నీచుఁడు జగ రాయఁడింతపని యొనర్చెను. ధనాశకులోఁబడి నేనింతటి ద్రోహకార్యమొనర్చితిని. పెండ్లికినై రాజుగారి పేరిట నీ పంపిన జాబు ద్రోహి యెటులనో యుంచెను. నాకనేకవిధములగు ద్రవ్యాశఁ గలిగించెను. నా క్రింద రెండువేలసేననిచ్చి నీ వివాహమునకు రాజుగారు దగర పంపినారను నెపమున నిన్నుం జేరిసమయముగాచి విన్న సమయింపుమని బోధించెను. రాజుగారినిఁ జెఱనుంచినవార్త తిరుమలుఁడు చెప్పినదివిని, కాలవిశేషంబము కాలానలముగఁ బరిణమించునని యెఱిఁగ్న సమయముగాచక నిన్నుఁ జెగ్రవేయఁ గేలెత్తినంతటనె యెచటనోయుండి నాచర్య గుర్తించిన యీ వీరాంగన నన్నుఁబొడిచెను. నా ప్రాణములుపోవుచున్నవి. రాజద్రోహికి విశ్వాసఘాతకునకుఁ గాఁదగినశాస్తి యయ్యెను. మాటలాడఁజాల.

యాచమ:— [భటులనుఁజూచి] భటులారా! వీనినెత్తికొని శస్త్రచికిత్సశాలకుఁగొనిపొండి. [నాయకులంజూచి] నాయకులారా! మీమీసేనలతోఁబోయి యుపతిదూరంబుననున్న యీ నీచుని సేనపైఁబడి శరణనినవారినివదలిమిగతవారినిఁజంపుడి. సైన్యమ్ముల వెళ్లుడి. [నాయకులు నిష్క్రమింతురు] [బ్రాహ్మణులనుఁజూచి] ద్విజోత్తములారా! నాకు శుభదినము కాదేని నా ప్రాణములెప్పుడో పోవుచుండెను. మీకెల్లరకు నమస్కరించెద. మీమీగృహములకుఁ బోయిరండు.

[బ్రాహ్మణులునిష్క్రమింతురు.]

[కుముదినిఁజూచి] (కేలిడి చుఁదటికిఁబిలిచికొనివచ్చి.) ప్రాణప్రియా! కుముదినీ; నీమోముఁజూడ నాగ్రహపరవశయయివీరావేశమును దాల్చినరీతినగపడెను. కనుబొమలముడి వదలుము. క్రోధావేశమున నెఱ్ఱబాఱినముఖనేత్రభావములు ప్రసన్నతనందనిమ్ము. ఇంత టిశ్వాసోచ్ఛ్వాసములకిపుడు కారణంబు లేదుగదా?

కుముదిని:— వీరశిఖామణీ! కాలవిళంబమేల? సిద్ధపడుము. స్వామికిఁ ప్రాప్తిల్లనున్నవిపత్తునునివారించు కార్యమునకునదేహములు సమసిపోనిమ్ము. పదియుపదిరమున మనసుసమాధానమున నుండినహాలక్ష్మ ముఁజేఁకొనవచ్చునని ఋషివర్యులు పలికిరికదా? ఇపుడుస్వామికిసంభవిల్లిన విపత్తునువినుటచే మనమనస్సు తాపమునకుఁగురియయ్యెను. కాపున మనమిపుడువివాహ కార

కులు కలంచుటకుఁ గారణము లేదు. స్వామినిష్ఠుఁ డనరి ఖ్యాతినందిన నరసింగరాయనికడ పుట్టిన స్వామినిష్ఠుఁడయి విజయనగరసంస్థానమున ప్రఖ్యాతి నందిన వీరాగ్రేసరుఁడయిన యాచమనాయకుని వీరపత్నిగ నెన్నంబడు నీ మదిని స్వామికార్యమునకు విఘ్నము గలించునా? వీరాగ్రణీ! నీవు నా పాణిగ్రహణ మొనర్చు కాలమున స్వామికిఁ బత్తు సంధర్శించిన కారణమున నేను విప్రరూపధారినైతిని. ఈయపరాధప్రాయశ్చిత్తమునకునై ఈ దేహమును నీ నీడఁగ నొనర్చినను వెన్నంటియుంటకుఁ దప్పు దాననుగాను. ఋషివర్యులతిరహస్యముగ వచించిన భవిష్యదనుభవము మాకిపుడే ప్రాప్తించెను. ప్రాణప్రియా! స్వామికార్యమొనర్పు దీక్షవహించు వారికి విషయసుఖేచ్ఛ కూడదు. కావున స్వామికార్యము ముగియునంతవఱకు విషయానుభవేచ్ఛ రూని బ్రహ్మచారిణిగ నీకు సహాయ్యపడెదనని గురుచరణముల యాన ప్రతిజ్ఞ యొనర్చెదను.

యాచమ:— ప్రేయసీ! ప్రేమాతిశయమున నా ప్రాణమును రక్షించుటయగాక యభిమానపురస్సరంబుగ నా కార్యములందు సాహాయ్యపడఁబూను కులశ్రేష్ఠులబలె ప్రతిజ్ఞాపూర్వకముగ బ్రయత్నింపఁ బూనుటఁగని ప్రమోదమందితిని. ప్రేయసీ! నీ జాగరూకత నా ప్రాణమునకు సంజీవకరణి యాయెను. స్వామికార్య శేఖరమునకుఁ గారణమాయెను. నీయుపకృతినై తస్మరించినను తీఱదు. ఇట్టి సాహసికురాలగు నీవు నాకుఁ జేదోడువాదోడుగనుండ స్వామికార్యమొనర్చుటకు నేను యమునికోరలలోనైనఁ జొరఁ సమర్థుఁడనయ్యెదను? కర్తవ్యదక్షయగు నీవుఁబోలు కాంతతో హెచ్చుమాటలేల? కర్తవ్య కార్యంబిపుడాలోచింతము కూర్చుందుము. ( కొంకుపీఠములు ముందరికి నీడ్చికొని కూర్చుందురు. )

మ. కులమర్యాదల గౌరవంబు నకటా కోల్పోయి, మానాయకుల్
చెలిమిజ్జేసిరి యానరాధమునితో, నేమంబటంచెన్ని, నీ
చులమూడ్కిన్ దమసేన నంతయు నయో సొంపేరఁగా నిచ్చిరా
కులహీనున్ గలయన్, సనాతనవిధుల్ గ్రాలన్ యశంబాఱఁగన్.

(జగరాయనినుండి వకీలు ప్రవేశించి)

వకీలు:— (యాచమనాయకునకు వందనమొనర్చి) యాచమనాయఁడుగారూ! నా స్వామియగు జగరాయఁడు కమ్మగంపిన యీ లేఖ నా చేతికిచ్చినాఁడు.

యాచ:— అయ్యా! నీవిచటికెన్నఁడు వచ్చితివి?

వకీలు:— నిన్న వచ్చితిని.

యాచ:— ముద్దురంగనితోఁ గూడి వచ్చితివియా?

వకీలు:— వాఁడు నాకంటె నిందుకము న్నే వచ్చినవాఁడు.

యాచ:— వాని కార్యము నిష్ఫలమైనచో నీజాబు నిమ్మనియా నీవు విజగరాయని దురాలోచన కాఁబోలు. మంచిది. అయ్యా వకీలా! ఆఖలుని రాజద్రోహియగు జగరాయని జాబు నేఁ జేతనుండియుందను. నీవేచదువుము.

వకీలు:—మంచిది. ( జాబునువిప్పి )

దూరదర్శివగు యాచమనాయకా! నీవపక్వవిచారుఁడవయి నూతననృపాలుని చరణ సన్నిధికివచ్చి శరణందకున్న నీ పరిణామమునకు హానికలుగునని చక్కఁగఁ దెలియుము. నీవే రాజపక్షమూనితివో యా రాజు సకుటుంబముగఁ గారాగృహబద్ధుఁడయియుండఁడు. నూతన రాజు వారికి నట్టి శిక్షనుయినను విధింపనొల్లఁడు. ఈ స్థితియందు నీ దొరగారి యంకురము సైతము నిలుచుట దుర్లభమగును. ఇఁక నీవెవరిపక్షమూని పోరాడెదవో నీ వెఱుంగుము. రాజద్రోహివగు నీ పక్షమే వాదుకులవలంబింతురు? దీనిని చక్కఁగ విచారించి, విశేషించి నూతనరాజుపక్షమూనితివేని నింతటినుండి నీ వైభవాధికారములెల్ల నీకు నడపింపఁబడును. కాదేని నీవు రాజద్రోహిగనెన్నఁబడి కఠినశిక్ష నందుదువు.

యాచమ:—( కోపమున ) ఓరీ! నీవు స్వకలో నిచటినుండి వెడలి నీదుదగు జగరాయనికిఁ దెలుప వలసినదేమన “ జగరాయా! నూతనరాజెవరికిఁ బుట్టినవాఁడో వానికులగోత్రములేమో యెవరికినిఁ దెలియదు. అట్టివానికి నేను శరణ్యుఁడగుదునా? ముసలిముండవలె మూలఁ గూర్చుని మూల్గెదవేల? ముందెవరికి రమ్ము. ఎవరిచరిత్రము మెట్టులగునో తెలియును. నా విచారములు, పక్వముగ నుండిన నేమి? అపక్వముగ నుండిన నేమి? శుద్ధాంతఃకరణమును నా స్వామిహితము నేసేవ్యముగ నుంచికొన్నందున ఫలించిన విచారమది. స్వామికార్యమునకునై భయంకరాగ్ని జ్వాలలనైన దుముకెదను. ఓరీ మూర్ఖా! జగరాయా! విశ్వాసఘాతకుఁడవయి రాజుగారిని సకుటుంబముగఁ జెఱవిడిపింతువా? ఇది నీ పరిపక్వవిచార ఫలమా? కారాగృహవాసియగు నా స్వామినిఁ దుఃఖపెట్టింప నీకు ధైర్యము చాలదని నే నెఱుంగుదును. ఒకపక్షమున నట్టి క్రూరసాహసకృత్యము నీవాచరించినచో నీయొక్కయు నీకు సాహాయ్యపడువారియొక్కయు నా ఖడ్గప్రమాణమునకు నదియె తుదిదినమని చెఱఁగునకు గట్టిగ ముడివేసికొనుము. ఇంతటివిపన్నస్థితియందైనను స్వామిపక్షము వదలని నేను రాజద్రోహినగుదునా? నీ యునమఁడగు నూతనరాజు, రాజవంశజుఁడు కాఁడని నీ వెఱింగియును స్వపక్షాభిమానమున నిజమగుస్వామికిఁ బ్రతిహితచింతన చేయు నీవు రాజద్రోహివి. స్వామికార్యమున దేహమునైన నర్పించు యాచమనాయఁడు వైభవాధికారములు సరకు సేయునా? తాత్కాలికోపభోగమున గర్వించిన జగరాయా; అఱచుముక్క కఱపదనునది నమ్మి నోటి దుడుకుతనమునకుఁ బోవలదు. రాజద్రోహివగు నీవు శాసనార్హుఁడవు ”

అయ్యా! వకీలూ; ఈ నా మాటలలో నొకయక్షరమైనను తగ్గింపక యాఖలునకుఁ జెప్పుము. మఱియు నీ మాటలు నా మాటలుగఁ బల్కుము.

సీ. జగరాయ! నీవిటు పొగరెక్కియాడిన
మాటలు నేనెందు మఱవననుమ
రాజును:జెఱ:బట్టి రారాములను బెట్టు
ఘోరాఘఫలము గుడుచుననుమ

యాచ:— చాకలవాఁడుదికి తెచ్చి పెట్టిన బట్టలమూట.

కుముదిని:— నాథా!

ఉ. ముయ్యకుముయ్యఁ దీర్పుమను మూఢులసామితె నిక్కువంబుగా
జయ్యన నేగి చంద్రగిరిఁ జాకలినై చరియించి కారనుం
డయ్యవనీధ రాక్షసుని నారయ నొక్కనిఁ దెచ్చెదన్వడిన్
నెయ్యము మీఱ నర్థయత నెచ్చెలి కిమ్మయనుజ్ఞ యియ్యెడన్.

రణసాధనకంటె నుపాయసాధనము మేలని రాజనీతియున్న దికదా? గోటఁబోవు పనికి గొడ్డలి యేల? మీరెటులయినను మనరాజుగారింటి చాకలిని బిలిపించి నా మాటలు జవదాటనటుల చేసితిరేని నేనొంటరిగా గురువుల కృపాతిశయమునను మీ ప్రతాపమహిమవల్లను గార్యము సాధించి రాజకుమారు నొసఁగి మీ శిబిరమునకుఁ జేర్చెదను. మీరు చంద్రగిరికి నసతి దూరమున సేనతో నుండుడి. శత్రు రక్షణమునకు గాడిద కారణమ్మయినరీతిగ నెంతటిమహా త్కార్యముననైనను నొకానొక సమయమున స్వల్పసాహాయ్యంబున సాధింపనగునుగదా? ప్రాణపతీ! నే నబలను, నప్రబుద్ధ, సమర్థపరిహీనయని తిరస్కరింపక స్వామికార్య సాధనమునకు నాకు సంపూర్ణస్వాతంత్ర్యమియ్యవలెను. నేఁ జాకలినయ్యెదను.

యాచ.— కుముదినీ! నీవు కుసుమకోమలాంగివి. అంగాంగ సౌందర్య సౌష్ఠవముకలదానవు. నీవు పోఁదగినది శత్రుక్షేత్రము. శత్రువులు నీతిపక్ష విహీనులు. మర్యాదగ నీవెటు లచట నుండఁగలవు?

కుముదిని:— మానముగల స్త్రీ సన్మార్గధన్యయని చిన్నతనమునుండి నే నెఱుంగుదును. నా మానమును రక్షించునది నా కృపాణమేను. (అనుచు లోనుండి బాకుఁదీసి చూపును.)

యాచ:— (ఆశ్చర్యమభినయించుచు) భామా! నీవు నా భార్యవగుచు జాకలివగుట యనపేక్షణీయము.

కుముదిని:— నాథా! నే జననమునుఁబట్టి వెలమను. బ్రాహ్మణసేవ యొనర్చునపుడు బ్రాహ్మణినైతిని. పతికార్యసాధనమునకై యిపుడు చాకలినయ్యెద. మానినికి మానముముఖ్యము. మిగతవి వేషములు. ప్రపంచనాటకమున దినదినము వేషములు మాఱుచుండును.

యాచ:— మానినీ! నీ దృఢమానసశక్తికి నే మెచ్చితిని. నీ యిష్టానుసారంబుగఁ దగినసాధనములు నీకు సమర్పించెదను. రేపటిదినంబున నే చంద్రగిరిసమీపమునకు వెళ్లుదము. రమ్ము. ప్రొద్దైనది. గృహములోనికి వెళ్లుదము.

(నిష్క్రమణము.)



# చంద్రగిర్యభ్యుదయము.

## తృతీయాంకము - ప్రథమరంగము.

చాకలినరసిగాఁడు - చాకలిచెంప - కారాను గాచుభటులు - [కారాగృహము]

చెంప:— (స్వగ) నేనిచటికివచ్చి యిరువదినములయ్యెను. ఇచటనెందరో గాముచాలా రెల్లరును నాకుఁ దెలిసినవారైరి. ప్రారంభమునఁ గొన్నిదినంబులు దుర్మార్గబుద్ధి చేనన్న హాస్యములాడుచు మాటలాడుచున్నను నాగుణముచ్చెలెఱిగి పిదపనన్నుఁ దమచెల్లెలుగభావించి గౌరవించుచునార్న. నేనిచ్చు మత్తుద్రవ్యములను సంతోషముగ స్వీకరించుచున్నారు. బట్టమి టవి గొన్నిదినంబులు శోధించిరిగాని యిటీవలయెట్టి శోధనసైతము లేకయున్నది. రాజదేవుఁడను వానికి మాత్రము నే భయపడుచుంటిని. వాఁడు మూరనుండియే ననెల్లప్పుడు జాగరూకుఁడయి చూచుచుండెను. వాఁడిపుడు మూఁడుదినములుగ నిద్రపట్టక రాకయున్నవాఁడు. కావున నేకారతున్న రాజగారితో మాటలాడి నేనవచ్చినదియు తెలుపుటకు మార్గముదొరకెను. దొరగారితో మాటలాడితిని. పండ్రెండువత్సరముల వయస్సుగల చిన్న వెంకటరాయని బట్టలమూటలలోఁ గదలమెదలకుండఁ బంపిదమని మాటయిచ్చిరి. అతనినేఁడే కావలెను. రేపు పుట్టినరోజుటకి రాజదేవుఁడువచ్చునఁట. వాఁడువచ్చినేని నాపనిఁగొనసాగదు. రాజగారితో నేను మాటలాడునది వాఁడిపుడే చూచినాపై ననుమానగ్రస్తుఁడయినటుల వానిముఖభావముగపడఁజేసెను. కాలవిళంబము పోలాహాలముయి పరిణమించునేమో? నేఁడే కార్యశిఖరము గావలెను. చేయవలసినపని నంతయును చాకలికిఁ దెలిపితిని. కావలివారికి నేనిప్పుడే మత్తుపదార్థములిచ్చి మత్తెక్కించెద (అనుచు దూరమునఁబడిన కావలివాండ్రనుఁజూచి) వీరందఱిప్పుడే మత్తెక్కి నహారింపఁబడినారు. వీరికి మఱియును మత్తెక్కించెద. (ఒక కావలివానిఁజూచి) అన్నా! ఏమియటులఁబడినావు? ఆఁకలిఁగొంటివిటూ! ఇంటినుండియున్నమురా లేదా? నీకుఁగా నించుక ఫలాహారముదెచ్చినాను. సేవించెదరా?

కావలివారు:— (అందఱును లేచి) అమ్మ. తెమ్ము. ఇటుతెమ్ము. నీవిచ్చు ఫలహారము రుచిగనుండును.

చెంప:— అందఱికినిలడ్డుపంచియిచ్చును. (అందఱును భక్షించి కొంతతడవుకి హెచ్చరికతప్పినవారిగఁ బడుదురు. నరసనికన్నఁజేసి పిలిచి లోనికిఁ బంపును. నరసఁడు లోనికివెళ్లి కొంతతడవుకి బట్టల మూటమోసికొని వెలికివచ్చును)

చెంప:— (వానితోఁబోవుచు) ఇట్టివారు కావలిగాండ్రయిన నెట్టిమోసకృత్యమైనను సలుపనగును.

(నిష్క్రమణము.)

పుత్రునితో నేను పాపతియగు యాచకువాయని కేరఁబోనిమ్ము. కాజేని నన్నుఁజయించి మృత్యువుకు బలిగనిచ్చి బాలునిపహరింపుము. ఇకార్యమునుండి నీకునధికకల్యాణమగును.

రా. జేంద్రదేవ:— (చేతులుపదలి దూరమునకుఁబోయి) అమ్మా. నీవెవరు? విప్రుణ్యాగ్నిని పాణిగ్రహణ మొనర్చినదానవు? నీయథార్థగంభీరభాషణములువిని నీకొంగొప్పయింటఁనమునఁ బుట్టినదానవని నేనమ్మినాను. నీకేలు నేఁబట్టినప్పుడు నామనంబునఁదించుకయైనను పాపవాసనలేదుసుమా! పతివ్రతకాపము ప్రజ్వలితాగ్నియని నే నెఱుంగుదును. అయితే నాస్వామికత్రుపుత్రు తెలనుండి యెత్తికొనిపోవుటఁబ్రతిబంధించి స్వామికా ర్యముసాధింపవలెనను సదుద్దేశముననిన్నుఁ బట్టితిని. నన్ను క్షమింపుము. అయినను స్వామికార్యధురంధరుఁడు నేనుకావున రాజపుత్రుని మాత్రమువదలిపోఁజాలను. ఈకార్యము నేనొనరింపవలెను. ఒపరింపకతీరదు. ఏనాగ్రమున నాపౌరుషమును జూపి యధర్మముకానటుల స్వామికార్యము నెఱపవలెనో నీవే తెలుపుము. నీవచనము నకునెట్టివ్యత్యాసమునుఁగలుగనియక నాకార్యమును సాధించికొనియెదను.

చ. వదలవు రాజపుత్త్రు నిటువారిజలోచననీవు, నేనుసుఁ
వదలను రాజభక్తి జనవందితకీర్తి నిజంబుగాన, నే
వదలను రాజపుత్త్రునరి వంశవివర్ధను, మేననుండఁగా
మువితరో యావిరుద్ధవిధముల్ సమకొల్పువిధంబుఁ దెల్పవా.

( అచేతులుభటు లాయుధపాణులయి ప్రవేశించి. )

భటులు:— వీరవర్మ్నియగు నరసింగరాయనిపుత్త్రి తల్లీ. కుముదినీ! భయపడకుము. భయపడకుము. ఇదిగో వచ్చితిమి. వచ్చితిమి. ( వచ్చి శాత్రవభటులనుఁ జుట్టుకొందురు. )

రాజదే:—( అగ్రహమున నోలనుండి కత్తిఁదూయును. భటులంజఱును దమతమకత్తులెత్తి సమరము నకు సిద్ధులగుదురు.)

కుముదిని:—( రాజదేవునిఁజూచి ) రాజదేవా! ధర్మయుద్ధమార్గము దెలుపుమని యింతకుమున్నే నన్న డిగితివి. నా ప్రత్యుత్తరమును వినకనే, మే మూరకయుండినను, హటాత్తుగనీవు కృపాణ పాణివగుట ధర్మమా? నా లేఁతగ్రుముదిను ప్రామాణికబుద్ధి నీకుఁగలదని ప్రారంభమున నీకత్తినికోలలోనమర్పుము. నీభటుల నటులొనరింప నానతియిమ్ము. నామాట యందుగౌరవ ముఁగల నావారునటులనే యొనరింతురు. కార్యముందబవసరము సంటయు సమంజసము. (అందఱునుగత్తు లొలలలోదూర్తురు ) రాజదేవా; నీశస్త్రయుద్ధమొనరించి యిప్పుడే స్వామికార్య సాధనమునకై రాజపుత్రునపహరించెదనియును దానికిమార్గము తెలుపుమని యనునన్నడిగితివికదా? ధర్మయుద్ధము మాటకు నేనమ్మతించితిని. ప్రస్తుతమునా పక్షమూ నిన సేనహెచ్చుగనున్నదికదా? నిన్నుబరాజితునిఁజేసి రాజకుసునితోఁ బోవలెనని నాకెంత మాత్రమపేక్షలేదు. రాజపుత్రుఁడు నా సరసనుండు కారణంబున వానిఁగాపానుభారము నాయది. ఉభయపక్షము సేనయును దటస్థులై నిలిచియుండనిమ్ము. మనమిరువురము యుద్ధ

మొనర్తము. నేను జయింపఁబడినచో రాజపుత్రుని నీ వపహరింపుము. నేను నిన్ను జయించినచో రాజపుత్త్రుని నాపతిసరసఁజేర్చి కృతకృత్యనయ్యెదను. ఇది ధర్మయుద్ధమని నాకుఁదోఁచుచున్నది. నీకిది సమ్మతిగాయెనచో యుద్ధమునకు నిలువుము. ఇందేమయిన సందేహమున్నచో ధర్మయుద్ధమునందభిమానులగు వారిని నడిగి తెలిసికొనిరమ్ము. నీ విపుడుపిలిచినను నే సిద్ధనై యుండెద. చిత్రదుర్గాధిపతియైన దుర్గప్పనాయకుఁడు నీతివిశారదుఁడనియును ధర్మయుద్ధాభిమాని యనియును నాపతి కొనియాడుచుండెను. వారినిఁ బ్రశ్నించి యీ సందేహమును దీర్చికొనిరమ్ము. ఈ నా నియమమునకు నా పతి యాచమనాయఁడు సమ్మతించును. సమ్మతింపఁడేని వచనభంగదోష ప్రాయశ్చిత్తమునకునై నే నగ్నిప్రవేశ మొనర్తును.

రాజదే:—(స్వగ) నేనే దుర్గప్పనాయకుఁడనునది యీ వనితారత్నమునకుఁ దెలియదు. అటు తెలియనిదే మేలాయెను. కాదేని దుర్గప్పనాయకుఁడు నీతివిశారదుఁడను నా యశమునకుఁ గుందుగలుగుచుండెను. స్త్రీతో యుద్ధమొనర్చుట ధర్మవిరుద్ధము. అప్పని నేనొనర్పఁజాలను. (ప్రకాశ) అమ్మా! కుముదినీ! నీవు యథాయోగ్యముగఁ బల్కితివి. తామసగుణ సాంబంధిక శస్త్రాస్త్రములు లేక సాత్వికవృత్తిని గుఱించిన సదుపదేశమున నీవు నన్ను జయించినదానవైతివి. నీకు నమస్కారములు. సకలపరివారయుతముగ రాజపుత్రసహితవై సురక్షితముగ నీ పతిసన్నిధిఁ జేరుము.

కుముది:—సన్మాననీయ పురుషవరేణ్యా! నీ సద్గుణాతిశయమున నీవు పూజ్యుఁడవైతివి. సకలరిటులుండినచోఁ గలియుగము కృతయుగమగుచుండెను. అన్నయ్యా! పోయివచ్చెదను.

(నిష్క్రమము.)

## తృతీయ రంగము.

### చంద్రగిరియాస్థానము.

జగరాయ - నలుగురునాయకులు - దుర్గప్పనాయఁడు - గుండనాయక.

మొదటినా:—వింటిరా! సమాచారము. జగరాయలవారు.

2-నాయక:—వారుఁ నకయుందురా? వాఁడెంతదుర్గర్వి. దురభిమాని. దుర్మార్గుఁడయినను వానిపైని విశ్వాసముతప్పదు.

3-నాయక:—ఇంటికినిప్పుదవిలించినంతవఱకునమ్మరు. పిదపనైతము నమ్మకయుందురా?

4-నాయక:—వీరివిశ్వాసముతనపైహెచ్చుగనున్నదనికదా వాఁడంతగమదమ్ముఁదృణీకరించుచున్నవాఁడు.

1-నాయక:—ఇట్టివానిని మనజగరాయలవారు నమ్మిరి కావుననే రాజకుమారుని యాచమనాయని సరసఁజేర్చను.

జగరాయ:—[ఉలికిపడి] ఏమి. ఏమీ! చెలునున్న రాజపుత్త్రుఁడు యాచమనాయని సరసఁ జేరినాఁడా?

యుద్ధము శూరులకౌశల్యముఁ బరీక్షించు నొకయుక్తాయి. సత్త్వశాలురగు వీరుల సత్త్వమును గొలుచు సత్త్వతులాయంత్రము. ఇట్టి ధర్మయుద్ధాభిమానులకు జయమునకంటెను కీర్తియం దభిలాష హెచ్చు. కావున క్షుద్రప్రసంగముఁ బట్టి తా ముదాసీనభావులగుట తగదు. రాజ పుత్రినిఁ బట్టి తెచ్చుటయే మకు ముఖ్యమైయుండినచో సెలవిండు. సేనతోఁబోయి యిపుడే పట్టితెచ్చెదను.

తిరకనా:--దురగప్పనాయకులగారూ! తా మాత్మపౌరుషమును పరోపదేశ పాండిత్యమును జూపుట చాలింపుడు. రాజపుత్రునిఁ బట్టి తెచ్చుటకు ననేకులూరు లిచటనున్నవారు. మిమ్ముఁబోలు విశ్వాసఘాతకులు దొరగారిసరసఁ జేరుటకంటెను లేకయుంట మేలు.

దురగప్ప:—[ ఆగ్రహమున లేచి ] జగరావుగారూ! నానుండి యపరాధమేమయిన జరిగియుండిన క్షమిం పుడి. అంతఃకలహములనుండియే దుర్యోధనుఁడు చెడెను. స్వల్పవిషయములో స్వపక్షము శిథిలపఱచికొనుట సమంజసము కాదు. మీకు నా సహాయాపేక్షలేదేని నాకేమియాగ్రహము లేదు. నా చిత్రకల్లు దుర్గమునకు నేఁ బోయెద. అయినను నొక్కతూరి మీ పక్షమువహించిన వాఁడను కావున వైరులఁజేరి మిమ్ము నెదిరింపను. తటస్థుఁడనయి స్వస్థముగనుండెద. విపత్ప్రాధితులై గొప్పవారాశ్రయమడిగినను వారికి నిచ్చెద. మీ రనుభవశాలురయ్యును నీచులమాటలు విని మాత్సర్యబుద్ధి వహించితిరి. ఇఁకనైనను వినాశకాలము రానటుల జాగరూకులయియుం డుడి. నేఁ బోయివచ్చెద.

సీ. శూలపాణులఁబోలె వాలుచాలునుఁదాల్చి
వీరులాలముఁజేయు విధముఁగనుచు
శూరులై వైరులు పోరుచు నినుఁబట్టి
రారాపుఁబెట్టెడు రాపుఁగనుచు
యాచమనాయఁడు గాఁచి నిన్బట్టుచు
కీచుకీచనిపించు కీడుఁగనుచు
నీదారపుత్రులు నీబంధుమిత్రులు
పోదారిఁగనక సొంపేదఁగనుచు
గీ. వీరుపోరిజయింతురో? వారునిన్ను
బంధముక్తునిఁజేతురో? బంధుహితుల
వీరుగాతురో? వీరాధివీరులెవరో?
కానిచూడుముజగరాయ కన్నులార.

[ నిష్క్రమము. ]

గుండనా:--జగరాయలవారూ! గొప్పవారగు దుర్గప్పనాయకులకే, యీ దుష్టులమాటలువిని మీరంతగ నవమానమొనర్చితిరి. ఇఁక మర్యాదపై దృష్టియుంచినవారెవరు మాపక్షమవలంబింతురు? చాలుచాలు. మీ మర్యాదాభిమానములు నేనును బోయెద.

[ నిష్క్రమింతురు. ]

జగరాయ:—[ మిగతనాయకులఁజూచి ] నాయకులారా! మీ మాటలువిని శూరులగు మనగప్పనాయక సుందునాయకులను బోగొట్టికొంటిని. ఇఁకయెంతలు మమ్మువదలివెళ్లెదరో తెలియదు.

[ అనిలేచును ]

I. నాయ:--జగరాయులవారూ! మముఁబోలుశూరులనేకులు మీ పక్షమవలంబించి ప్రాణములియ్య సిద్ధులయియుండ మీకువచ్చినభయమేమి? మీకేచింతయువలదు. రండు. పోవుదము.

ఉ. భ్రష్టునిమాటకీవిటుల బాధనుజెందుట మానుమయ్య యే
కష్టమునందునైన వినుఁగాంచెడి ఘోరముమమ్ముఁ గూడె, నా
దుష్టులు వైరులాజిమముఁ దొందరఁ బెట్టఁగ శక్తులౌదురే
నష్టము రాదునీకెపుడు నమ్ముము సంతసమందుమామదిన్.

[ అని వెళ్ళుదురు. ]

[ నిష్క్రమణము. ]

## చతుర్థరంగము.

### వెంకటగిరి యాస్థానము.

చిన్న వెంకటరాజుగారు - యాచమనాయఁడు - నాయకులు - చాందుఖాన్ భటులిరువురు - పురుషవేషముననున్న కుముదిని ( చిన్నరాజుగారి యిరుప్రక్కల యాచమనాయఁడును కుముదినియుఁ గూర్చుండియుందురు )

యాచ:—[ లేచి ] శూరవరులారా! ప్రియమిత్రులారా! ఈ రాజ్యమింతవరకు మాకు లభించిన కారణంబున మిముఁబోలు శూరులెల్లరు వారి సాహాయ్యమునకు దొరకిరి. మనపక్షము మున్నుకన్న బలిష్ఠముగుచువచ్చినది. అయినను రాజద్రోహియగు జగ్గరాయని సేన హెచ్చుగనున్నది కావున వానితో యుద్ధమునర్పఁ బూనవలెనని విచారపూర్వకముగానే, యారంభింపవలసినదిగ నున్నది. మీరెల్లరును శూరులు. విచారసంపన్నులు. స్వామికార్యరతులు. కావున మీరీ విషయము జక్కఁగ నాలోచింపఁదగినవారు. మనదొరగారు కుటుంబసహితముగఁ గారాగృహమున గాసిచెందుచున్నవారు. మనమిట్లు కాలహరణముసేయుచున్న వారిగతియేమి? మిము నాలోచించి యుద్ధమారంభింపవలసినదిగ నున్నది. కావున నీ విషయమున మీ యభిప్రాయములిత్తురని నే విన్నవించెద.

భటు:— మహాప్రభో! బాదుషానుండి యొక సేనాధిపతివచ్చి తమదర్శనమునకునై ద్వారంబునఁ గాచినాఁడు.

యాచ:—వారిని లోనికిఁ బిలిచికొనిరమ్ము.

చాందుఖాన్ ప్రవేశింప యాచమనాయఁడు లేచిపోయి యొకయుచితాసనముపై నతనినిఁ గూర్చుండఁబెట్టును. మిగతవారొకరిమోమొకరు జూచికొనుచుందురు. పురుషవేషమున నున్న కుముదిని యాచమనాయని చెవులో నేమోపలుకును. అతఁడు తలయూచును. ]

చాందుఖాన్:— అదియెట్టుల?

యాదవ:— చాకలినై కారాగారము దూరి కావలివాండ్రను గను బామి బట్టల మూటలలో రాజపుత్త్రునిఁ దెచ్చితి.

చాందు:— ఔరా స్త్రీ సాహసము. ఈ నారీరత్నమును నా చెల్లెలిగ భావించి గౌరవించెదను.

యాద:— చాందుఖాన్ గారూ!

చ. కటకట యేమిసేయుదును కర్ణమిదేయని తోఁపదేమియున్
గుటిలదురాశయుక్తులు, కుంభినిభర్తనుఁ గారనుంచి, యే
యుటమటలుంతురో మఱల నాయువదంతురొ దారపుత్త్రులన్
కటికలఁబోలె క్రూరులయి కంశముఁ జెంతురో! చింతఁ జిక్కితిన్.

నా మానసమున కించుకయైనను సమాధానము లేదు. మా దొరగారు చెఱలోఁ జిక్కి యా ఖలులొనరించు చెనుకులెన్ని గుడుచుచున్న వారో? ముందా రాజద్రోహులు మా రాజుగారిని సంహరింప యత్నింతురేమో కదా? అట్టిపనికి వెనుదీయరా క్రూరులు. అంతటి కార్యము కాకమును పే యుద్ధమొనరించి జయమార్జింపవలెను. జయమార్జించుటకు బలతారతమ్యం బాలోచింప వలసిన దగుచున్నది. మనదిక్కున నిపుడు కూడిన సేనకంటెను రెండింతల సేన యా జగరాయని వద్దనున్నది. పైఁగ వానికి స్థానబలమున్నది. మా రాజుగారి పూర్ణాయువు వానికెర గతమైనది ఇట్టి స్థితిలో నాతురపడి మనమొనరించిన కార్యము వ్యర్థమగునేమోయని భయమగుచున్నది. ప్రారంభమున, రాజుగారి బంధవిమోచన మవశ్యకము. ఈ విచారమెన్ని దినములు? ఆలోచన యెన్ని దినములు? ఈ కార్యసాధనమందు విలంబము నే సహింపఁజాలను. అనన్యగతికుఁడగు నీ రాజపుత్త్రుని నీ వశపఱచినాను. వానిఁ గాపాడు భారము నీయది. నేను నా సేనంగూడి యుద్ధమునకుఁ బోయెద. ఫలితార్థ మెట్టులైనఁ గానిమ్ము.

చాందు:— ప్రియమిత్రమా! నీ హితమునందు నా ప్రాణమైన నర్పించుటకు నేను సిద్ధుఁడనై యున్నాను. మీ దొరగారి బంధవిమోచనమునకు నేఁ బ్రయత్నించెద. నీవా విషయమున నిశ్చింతుఁడవై యుండుము. ఈ నీ మిత్రుఁడు చాందుఖాన్ మోసగాఁడు కాడు. విశ్వాసఘాతకుఁడు కాడు. స్వార్థసాధకుఁడు కాడు. పరహింసకుఁడు కాఁడు. ఈ నుడి నమ్ముము. జగరాయనిఁ జేరి నీ కార్యమును సాధించెదను.

యాద:— మిత్రమా! నీ మాటలపై నాకు సంపూర్ణ విశ్వాసమున్నది. కాని నీకు శ్రమయిచ్చుటకు నేనిపుడిష్ట పడను.

కుముది:— అన్నయ్యా! కఠినప్రయాణములొనరించి యలసి నేఁడే వచ్చితివి. అపుడే మఱల నీకేల యీ కష్టము,

గీ. అలసితివి నీవు కఠినప్రయాణమునను
మఱల బయనమ్ము నేల నా మనవి వినుము
కొన్ని దినములు నిలువుమా, యన్న నీవు
దలఁచినంతటి కార్యంబు సలుపఁగలవు.

చాందు:—అమ్మా! నీవు నాచెల్లెలివిగాని నీయన్న నీకేవస్త్రాభరణములియ్యఁజాలక యున్నవాఁడు. కావున నీవతి చింతనుఁబాపి మీరిరువురు దంపతులు సుఖమునయుండుట కనులారఁగని సంతోషించెద. అనుజ్ఞ యిమ్ము. ( నాయకుఁజూచి ) యాచమనాయకా! చంద్రగిరికి రెండుకోసులలో నీ సేనసంతయుననుగూర్చుకొని నీవు సిద్ధముగ నుండుము.

యాచ:—మిత్రమా! నీ యానతిరీతి వర్తిల్లెద.

చాందు:—అటులయిన రండు. ( నిష్క్రమము )

## పంచమరంకము.

### చంద్రగిరి యాస్థానము.

జగరాయఁడు - ఇరుగనాయక - చాందుఖాన్ - ఇతరనాయకులు.

ఇరుగనా:—జగరాయలవారూ. మన దినిరాజపుత్రునిఁగొనిపోయిన నాటినుండియుఁ దమకు స్వాస్థ్యము తప్పినది. కార్యములందౌదాసీన్యము హెచ్చినది. మీయుదాసీనత్వమునుఁజూచి పలువురు సామంతనాయకులు యాచమనాయని పక్షమవలంబించిరి. ఇటులైన మాకుక్షేమ మెటులొనఁగూడును?

జగరా:—మిత్రమా. నీవుపలికినకారణముగాక నాచింతకు మఱియొక కారణముగలదు. విచారశూన్యుఁడనయి వీరాధివీరుఁడగు దుర్గప్పనాయకునిఁ బదలితి. ఓకేమప్రపంచానుభవముఁగల నేను మూర్ఖబుద్ధియనుసరించితిని. భవితవ్యమెటులగునో తెలియకున్నది.

ఇరుగ:—జగరాయా! మించిపోయినపనికిఁ జింతించిప్రయోజనంబేమి? దుర్గప్పనాయకునంతటి సత్త్వశాలి మనపక్షమునకు వచ్చునటులున్నది. తాము సమ్మతింతురేని పిలిచికొనివచ్చెద.

జగరా:--వఃక్షత్రియుఁడగుయాచమనాయఁడుదప్ప దుర్గప్పనాయకునికిఁ దులఁదూఁగువారు హిందువులలో లేరు.

ఇరుగ:—నా బలుకు సత్త్వశాలి మహమ్మదీయజాతివాఁడు. బిజాపురము పాదుషా సేనాధిపతి. అతని పేరు చాందుఖాన్. అతఁడు యాచమనాయని యాశ్రయముఁగోరి పోయియుండెనఁట. హిందూసేనాధిపతుల యాజ్ఞాబద్ధుఁడయి యుండవలెననియును రాజునకు హైందవులమర్యాదరీతిగ సాష్టాంగనమస్కార మొనర్పవలెననియును యాచమనాయఁడడిగెనఁట. దానికి నతఁడుసమ్మతింపక యిచటికివచ్చినాఁడు.

జగరా:—చాందుఖాన్ నామము నేనినెఱుఁగుదును. అట్టి సేనాధిపుని పాదుషా యేలవదలెనో తెలియదు. ఇందేమో దోషమున్నదని నేనూహించెద.

ఇరుగ:—ఈ సేనాధిపతి యాచమనాయనిఁ తుంగభద్రాతీరమునఁబట్టి వదిలెనని పాదుషాకుఁ గోపము వచ్చి దేశమునుండి తరిమెనఁట. నిన్నటిదినము ఖానే నాకీవార్తఁ దెలిపెను. అతఁడు స్వాతంత్ర్యప్రియుఁడు. మనకు సేవావృత్తి కావలెను. ఈ రెంటికిని సంబంధము కుదురునాయని నే సందియించుచున్నాను.

జగరా:—మిత్రమా! కార్యముగునంతవఱకు వానియిష్టానుసారమే జరుగనిమ్ము. కార్యానంతరము చూచికొందము. వానినిఁ బిలిపింపుము.

( చాందుఖానును పిలిచికొనిరా నరుగ నాయకుండుపోవును )

1-నాయక:— ముసల్మానులు ఘాతుకులు. మనమర్మములు తెలిసికొనిపోవ నిచటికివచ్చియుందురు. వీరి నమ్ముటచెడుగు.

2-నాయక:— ముసల్మానులలోఁ ప్రామాణికు లెందఱోయుందురు. సామాన్యముగజాతి దూషణము కూడదు. మంచి చెడుగుణములన్ని జాతులందునుగలవు.

3-నాయక:— హిందువునకుఁ దొరకపడిన కాఫరువీఁడని పాదుషా దేశభ్రష్టునిఁ గావించియుండును. తురకదొరలనుఁ జేరలేకిందు వాఁడు హిందువుల యాశ్రయముఁ గోరుచుండవచ్చును.

(చాందుఖాన్ ప్రవేశించి సింహాసనమునకుదలవంచి పీఠముపైఁ గూర్చుండును.)

జగరాయ:— వీరవరా! చాందుఖాన్; మీ యాగమము మాకెల్లరకు సంతోషదాయకము. మీ వృత్తాంతమంతయును మాసేనానివలనవిని సంతసించితిమి. రాజద్రోహి యగు యాచమనాయఁడు వినుకొండ పోలు వీరాధివీరుని సాహాయ్యమును తిరస్కరించినది మా దుర్దైవమేను. హిందువులును ముసల్మానులును కొన్ని సమయములందు సంబంధబాంధవ్యము గల్పించుకొనుట పరంపరాగత సాంప్రదాయికముగనున్నది కావున మీరు మాకేమి పెరవారుగారు. కావున మీరు రాయలవారి సరసఁజేరి త్రికరణశుద్ధ్వకముగ రాయలవారికిసాహాయ్యమొనర్పవలయును.

చాందు:— ( లేచినిలచి ) జగరాయలవారూ! నన్నింతగ గౌరవించినందులకు నాకు సంతోషమైనది. రాయలవారిసరసఁ బనిజేయుటకు నేను సిద్ధుఁడను. అయితే నాకుఁ గొన్ని నియమములున్నవి. వానికి మీరు సమ్మతించి గౌరవింతురేని నే రాయలవారి సేవకుఁడనయ్యెదను. ఆ నిబంధనము లెవ్వియనః—

1. వీరాపురము పాదుషా, నా స్వామియగు కారణమున వారికి విరుద్ధముగ నా శస్త్రము లెత్తను
2. నాకు నప్పగించిన కార్యమునందు నాకే సర్వస్వాతంత్ర్యముండవలెనుగాని నాపై మఱియొకని యధికారముండఁగూడదు.
3. రణరంగమున నేఁ జెఱఁబట్టినవారి యొక్క యోగక్షేమములు వారి శిక్షానిర్ణయమును నా సమ్మతిపైననే జరుగవలయును.
4. వైరులసొమ్ములు భాగించువిషయములో నైకమే నేనే స్వతంత్రుఁడనుగ నుండవలెను.
5. మహమ్మదీయుల ధర్మమునందొక దైవమునకుఁదప్ప నన్యులకు సాష్టాంగనమస్కారముచేయఁ గూడదని యున్నది. కావున రాయలవారికి నేను సాష్టాంగనమస్కారములొనర్పను. ఈ నిబంధనలు మీకు సమ్మతమయ్యెనేని సేవకావృత్తికి నే సమ్మతించెదను. కాదేని సెలవిచ్చిన నన్యుల నాశ్రయించెదను.

జగరా:— చాందుఖాన్ గారూ! మీ నిబంధనలన్నిటికిని నే సమ్మతించినాను. ఆకుమందిని రాజపుత్రుని గొనిపోయిననాటినుండియును నాకు నేక్లేశము బలమయినది. ప్రారంభమున మీసాహసపరాక్రమములెల్ల జెప్పించి వారినిఁ బట్టితెచ్చి నా యొద్దుటనుంచితిరేని మీ సంపూర్ణనమ్మిక ముంచుటయగాక రాజ్యమునందు భూరిగౌరవనీయముగు పదవి నిచ్చెదను.

చాందు:— జగరాయలవారూ! నా కార్యమునకు నొక నారిని నొక బాలకుని బట్టితెచ్చుట యనేకమా? ఒక నెలలో నప్పని నొనరించి మీ మదికి సంతసంబు గూర్చెద. నాసేన కొంచము నున్నది. దానికి సాహాయ్యముగ రెండు వేలసేనయియ్యుఁడి.

జగరాయ:— మంచిది. ఇచ్చెద. పొద్దుమీఱినది పోవుదము రండు. ( నిష్క్రమణము. )

# శ్రీ

# చంద్రగిర్యభ్యుదయము.

## చతుర్థాంకము - ప్రథమరంగము.

యాచమనాయనిశిబిరము - అడవి.

యాచమనాయఁడు - కుముదిని - చాందుఖాన్.

యాచమ:— చాందుఖాన్ గారూ! ఏమియచ్చెరువిది? అర్ధరాత్రంబున వచ్చితిరి?

చాందుఖాన్:— నాయఁడుగారూ! అచ్చట జరిగిన వృత్తాంతంబులన్నియును మీకునప్పుడప్పుడు దెలియఁజేయుచుంటినిగదా. నాశిబిరమునుండి చెఱలోనికి సురంగము వేయుపని యింక నాలు దినంబులలో ముగియవచ్చును. జగరాయఁడు నన్నుఁ జూచినపుడంతయును కుముదినిని రాజపుత్రునిఁ జెఱఁబట్టు విషయమే మాటలాడుచున్నవాఁడు. దానికి నవిరయే కలవరింత యయినది. ఆఖలుఁడు తానిచ్చిన వాగ్దానము సలుపక వీరి నవమానపఱప యత్నించుచున్నది నిజము. వీరిమర్యాదకు సించుకయయినను గొఱఁత రానట్టుల సలిపెదనని నా ధైర్యము. అచటి నాయకులందఱును బెద్దలార్జించిన వైభవము ననుభవించుచు గర్వమున బిఱ్ఱవీఁగినారు గాని శౌర్యమున జాడ శూన్యమైనది. నా సేనతో నేవారినిను ముట్టింపఁగలవను ధైర్యము నాకున్నది. ఇపుడు సింహాసనాధీశుఁడెవఁడయినది వారిలోఁ గొందఱికిఁ దెలుసును. వీరనరసింగరాయనిపై సేనలో బలువురికి గౌరవబుద్ధి యున్నది. కావున వీరిరువురిని వారికంట వేయుట, మన కార్యమునకు శ్రేయమునిసాధనమని నాకుఁ దోఁచుచున్నది ఈ యల్లరిలో రాజుగారిని కుటుంబసమేతముగ సులభముగ వెలిఁదీయ నగును. కోటకావలివారినిఁ గొందఱిని సేనలో బలదికొన్నాను.

యాచమ:— సర్వము నిజముగుగాని కుముదిని నేమి సేయుదురో? రాజపుత్రుని మఱలఁ గారనుంతురో యని భయముగుచున్నది. అటులయిన నేను కుమారు వేషంబున వచ్చెద.

కుముదిని:— మీరిటుల వచ్చినను మిమ్ముఁ గుఱ్ఱింతురు కార్యము చెడును.

చాందుఖాన్:— చెల్లెలా. నిన్నుఁ జెఱఁబట్టు విధము దోఁపకయున్నది.

కుముదిని:— దానికేలయింతటి యాలోచన? ప్రతిశుక్రవారమును వేటకుఁ బోవునది మర్యాదగనున్నది. అట్టిసమయమున మృగయావినోదమునం బడి నేను రాజపుత్రుఁడును నీవుండిన సంకేత స్థలమునకు వత్తుము. నీవు మమ్ముఁ బట్టి మా నాథయమొసంగి కొనిపొమ్ము. నీవభయమొసంగి నవార్తయా ద్రోహికిఁ దెలియనిమ్ము.

చాందుఖాన్:— చెల్లెలా! స్త్రీబుద్ధి ముంగిటఁ బురుషులబుద్ధి దిగఁదీయవలసినదే నేను. రేపు పాడ్యమీ శుక్ర వారమే సంకేతసదిము. నాయఁడుగారూ! కార్యమెటుపోవు నెటువచ్చునో గాని మీరు మీసేనతోఁ గోటకు సనతి దూరంబున విడిసియుండుఁడు. ఎవరికినిఁ దెలియనట్టుల నే

నిచటకివచ్చినాను పోవలయును? సురంగముత్రోవ్వఁపనిని భద్రముగనొనర్పవలెను. పోయివచ్చెద.

యాచమ:— ప్రేయసీ. ఎంతటిసాహసకార్యమునకు నీవ్రుబ్రయత్నించితివి? అచ్చటివారందఱు దుర్మార్గులు.

కుముదిని:— నాథా! భీతిల్లకు వీరనరసింగరాయని కూఁతురుకీరురాలు మానరక్షణమునకు ఋషుల సంపూర్ణానుగ్రహమున్నది. ననురక్షించిన ఋషివర్యుఁడు సదాకాలము నాకగ్గైదుటనున్నాఁడు.

కం. పిల్లలఁగాఁచెడు పులిబలె
ఫుల్లసరో జాక్షులెందు భోరిగమానం
బెల్లపుడుఁ గాచికొని, తమ
యుల్లంబున సంతసించు చుందురునాథా.

యాచమ:— వనితార్నవా; నీవీరాజపుత్రునిపాలిదైవము నీకుఁదెలుపవలసిన విషయమేమున్నది. రమ్ము పోవుదము. (నిష్క్రమము.)

ద్వి తీ య రం గ ము.

అ డ వి.

యాచమనాయఁడు - వేటకాండ్రు - కుముదిని - రాజపుత్రుఁడు.

చాందుఖాఁ - వానిసేన.

చాందుఖాఁ:—(తనసేనతోనొకచోటఁలొంచియుండును వేటకాండ్రు వేఁటాడుచుందురు. యాచమనాయఁడొకమృగమును వెంబడించి యొకదిక్కునకుఁబోవును. కుముదినియును రాజపుత్రుఁడును మఱియొకదిక్కునకనఁగా చాందుఖాఁ యుండుదిక్కునకుఁబూర్వసంకేతమురీతిగవత్తురు. చాందుఖాఁ వారినిఁ జుట్టికొని.)

చాందు:—(కుముదినిఁజూచి) అమ్మా: నీవు బుద్ధిమంతురాలవు కావునదూరాలోచనవలిపి నామాటలరీతిగనడచికొనుము. జగరాయనిసేనకుఁడగునేను రాజపుత్రునివిన్నుఁబట్టను నిపుడునెలదినములుగఁబ్రయత్నించుచుంటిని. దైవయోగమున నేఁడునాప్రయత్నము ఫలీకరించెను. నీవు చండికనుమాని చంద్రగిరిదారిఁబట్టుము. మీదేహములకు సహాయముకానటులను, మీకు ర్వ్యధకుఁగుందురానటులను, నేఁజూచికొనియెద. నాశాస్త్రానమునునమ్మము. వచనమునకు భంగముకలుగు సమయమున నారుధిరములో నాశరీరముమునిఁగిపోవువఱకు మీరక్షణనే మానను. దీనికినను వెంబడించిన యీవీరులెల్లరు సాక్షులుగనుందురు.

కుముది:— (పైమాటలకు నన్నమాధానముగపలుచి విట్టూర్పువిడుచుచు చింతించుచురాజపుత్రునితో నచుచును)

చాందుఖాఁ (సేననుఁజూచి) వీరులారా; మీరతివేగమున మీ స్వామియగు జగరాయనిఁజేరి యిచ్చట జరిగినవార్త యంతయును దెలుపుచు రేపటిదినముననే దర్బారునెలవనిందు.

సేన:— చిత్తము. [నిష్క్రమము.]

## తృతీయరంగము.

### చంద్రగిరి యాస్థానము.

చిక్కరాయఁడు - జగరాయఁడు - నాయకులెల్లరు - చాందుఖాన్ - కుముదిని
చిన్నవెంకట్రాయఁడు - యవనసేన.

( సభయంతయును నెలసియుండును. వారివారిపీఠములపై వారు కూర్చునియుందురు. చాందుఖానుకు నొక్కనికిమాత్ర మొకపీఠముంపఁబడియుండును. )

( చాందుఖానును రాజచిహ్నములతో చిన్న వెంకటరాయఁడును ముసుగువేసికొని కుముదినియును బ్రవేశింతురు. చాందుఖాను, మామపీఠములేమి చూచి యాగ్రహపడి, చిన్న వెంకటరాయనిఁ తనపీఠము పైఁగూర్చుండనియమించి. తానొకప్రక్కను కుముదినియొకప్రక్కను నిలిచియుందురు. వీరెవరు సింహాసనాసీనుఁడయిన చిక్కరాయనికి నమస్కరింపరు. అదిగని.)

జగరా:—( ఆగ్రహమున లేచి ) ఖాన్‌గారూ! బీజాపురము పాదుషాగారి దర్బారునందు గొప్పవారని పించికొనిన మీకు దర్బారు మానమర్యాదలు తెలియవా? దర్బారుకువచ్చి సింహాసనస్థుఁడైన రాజునకు నమస్కరింపక యుండనగునా? ఈ రాజపుత్రుఁడును గుముదినియును రాజద్రోహు లగుకారణంబున బహుమానభాగరుఁజకారు. అట్టివారి నీరీతిగ మీరు మన్నించుటఁజూచి నాకు సంతాపమగుచున్నది. చెఱఁజిక్కిన యీ రాజపుత్రునకు రాజచిహ్నములేల? ఈ యుడుపులేల? ఈ డాంబిక మేల? చాకలియయి మైలబట్టలు మోయుచున్న యీ కుముదినికి గౌరవంపుముసుఁగేల? ఏమిచిచ్చియిది? ఖాన్‌గారూ! మీరు రాజద్రోహులకుఁగట్టికొని యిట్టి పిల్లాటలు చేయనగునా? ఏమాత్రము విళంబమొనరింపక యీకుముదినికిఁగల ముసుఁగు జొసఁగుజాపుడి. శిక్షింపనర్హులైనందున వీరిరువురిఁబట్టించి రాయలవారి సన్నిధికిఁ దెప్పించినాముగాని రాయలవారి సమానస్కంధులబలె మెరయుటకు వీరిని బహుమానపూర్వకముగఁ బిలిపింపలేదు. రాజద్రోహులైన యీ దుష్టుల వెన్నంటి దోఁబడుగురుయవను లాయుధపాణులయి లోఁజొచ్చి యల్లరిసేయనేల? ఇట్టి యుద్ధతులగు యవనులు రాయల వారిసేవకు నర్హులుకారు. మిగతమాట లటులుండనిమ్ము. దొంగతనమున రాజపుత్రు నప హరించికొని పోయినట్టియుఁ గులుకుతళుకులచే దుర్గపునాయకునంతటి ధీరుని వంచించి నట్టియు పరమసాహసి కుముదిని తనముసుఁగుఁ దీసివేయనిమ్ము. రాజద్రోహమను నేరము దానిపైఁ మోపఁబడినదిగనుక రాయలవారియెదుట నిలువనిమ్ము. ఈ రాజపుత్రుఁడ ప్రబద్ధుఁ డుగావున తమ్ముఁడు. వానినిపుడే కారాగృహమునకుఁబంపెదము. కుముదినికి యోగ్యముగు శిక్షగావించి మేఁ,తీరవలెను.

చాందు:—( కనలుచు జగరాయనిఁజూచి ) రాయలవారూ! నేను రాజదర్బారులోని శిష్టాచారభంగ ముగావించి యయోగ్యుఁడనైతిని. అయిలే మీరు వామనవి మన్నించునటుల మాటయిచ్చి విశ్వాసఘాతుకబుద్ధిచే మానఖండన మొనర్చుట గొప్పతనమా? యోగ్యమా? విజయనగరాధీశు లెన్నటికిని శిష్టాచారముఁదప్పువారుకారు. శిష్టాచార మొకరుదప్పినయెడల రెండవవారును యత్నములేక. దానికి భంగముఁగలిగింపఁబూనుదురు. సింహాసనాసీనుఁడైన రాజా

కుముది:— వీరవరులారా! చూచితిరియా; క్షత్రియపరాక్రమము. బాలుఁడైనను నేఁడు కేలఁ గృపాణమూని ధైర్యమున బలవంతుని నెదిరించుచున్నవాఁడు. సింహాసనాసీనుండయిన బాలుండు బ్రాహ్మణుఁడు కావున కేవల సాత్త్విక స్వభావమునను న్నవాఁడు. మీరే రాజును గొలువవలెనో క్షత్రియకుమారులగు మీరు యోచింపుఁడి. అన్నయ్యలారా! నా పతిసన్నిధికి నేఁ బోయివచ్చెద మీరక్షణ కవచంబు నిచ్చి నన్నుఁ బంపుఁడి. ( అనుచు రాజకుమారునింగూడి నిర్లక్ష్యముగ వెళ్లును. చాందుఖాను యవనసేనయు వారిని వెంబడింతురు.)

జగరా:— వీరవరులారా! వీరినింబట్టి చెఱనుంపుఁడి.

( నాయకులందఱును తలవంచికొనియుందురు )

నాయకులారా! మీరా కుముదిని మోముఁజూచి నిర్వీర్యులైతిరి. మీమీ గృహములకుఁ బొండు.

( నాయకులు నిష్క్రమింతురు. )

( చెఱకావలివాండ్రు ప్రవేశించి )

చెఱకా:— ( వందనమొనర్చి ) స్వామీ! నేఁటి ప్రాతఃకాలమున చెఱసాలచుట్టును దిరుగుచుండ నొక చోట మంచాళ్లు దిగఁబడెను. దానిని శోధింప ఖానుగారి శిబిరమునుండి రాజుగారినుంచిన చెఱసాలవఱకును సురంగమేర్పడియుండెను. లోనికిఁ బోయి చూడ యవనులైదుగురు రాజుగారితో మాటలాడుచుండిరి. వారినప్పుడే ఖండించి యచటఁ గొందరినిఁ గావలియుంచి తమకీ సమాచారమును దెలుపవచ్చితిమి.

జగరా:— ( ఆగ్రహము నభినయించుచు ) ఆ ద్రోహి చాందుఖాను కృత్యమిది. నమ్మి మోసపోతిమి. రంగరాయఁడు ప్రాణమున నుండుటవలనఁగదా యిన్ని మోసములకు మనము గుఱియగుట. సకుటుంబముగ వానిని సంహరించినచో నొక బాలుఁడు మన కేమి సేయును. ( తనతమ్ముఁడగు చిన్నవోబయనిఁ జూచి ) సోదరా! వైరిసంహారకార్యమున యమునంతటివాఁడవు. నీవు కొంతసేనతోఁ జెఱఁదూరి రంగరాజును కుటుంబసమేతముగఁ జంపిరమ్ము.

ఇరుగ:— జగరాయా! ఇటులొనరించునది హితకరము గాదు.

జగరా:— సేనాపతీ! నీవు చెప్పునది నిజమేను. అయితే యీ కలియుగమునందుఁ జెవులోఁ దులసీదళము దూర్చినచో నేకార్యమును సాధింప నేరము. రాజకార్యమున మోసము నన్యాయము నవశ్యకము. పూర్వమర్జునుఁడు తాతను నాచార్యులను బంధుమిత్రాదులను గటికవానిఁబలె సంహరించి రాజ్యమును గడింపఁడా? శిఖండిని ముందుంచుకొని భీష్ముని నోడింపఁడా? ధర్మరాజంతటివాఁడు ద్రోణాచార్యులతో నబద్ధమాడఁడా? పాండవజయార్థము శ్రీకృష్ణుఁడు కర్ణ దుర్యోధనులను వంచింపఁడా? ప్రారంభమున రాచరికమే కుటిలనీతితోఁ గూడినది. కలియుగమున బలమంతయును మోసముననున్నది. బలవంతుఁడు దుర్బలురను నశింపఁజేసియే రాజగుట. కావున నీకార్యమునకు నీవడ్డుపడకు. రమ్ము. పోదము.

[ నిష్క్రమణము. ]

# చతుర్థరంగము.

## చెఱసాల.

రాజుచిక్కరాయ (రెండవరంగరాజు) రాణి వీరనరసింగరాయఁడు.

ముద్దురంగమ్మ - దేవరాయ - నాగలాంబిక కోడలుకుప్పమ్మ - చిన్నవోబళ.

ఎనమంద్రు భటులు.

చిక్క-రా:--ప్రేయసీ! నిన్నరాత్రి జరిగిన ఘోరకృత్యములెల్లను స్మరించినప్పుడెల్ల నా మదియందేదోయొక విధమగు భయముద్భవిల్లుచున్నది. మనదిస్థితి యెంత యగాధముగనున్నదో చూడుము. రాజభక్తి సంపూర్ణముగాఁగల యాదవరాయఁడను శూరవరుఁడు మన బంధవిమోచనకై సలిపిన సాహసమంతయును నొక్కక్షణమున వ్యర్థమాయెను.

గీ. భవభయపరిహార, పన్నగాధిపహార,
నిగమసౌధవిహార నిర్వికార
రవిచంద్రపావక పవనబలాద్యష్ట
మూర్తిప్రకాశ, శ్రితార్తినాశ
త్రిపురసురాంతకా త్రిదశావనా యాశ
శంకర సతిపతి చంద్రమౌళి
భాస్కర హిమకర పావకలోచనా,
యఘుదూర యీశ్వర రుద్రమేరు

గీ. అంతకాంతక, యవ్యయ, యాదిదేవ,
ప్రమథగణనాథ, భూతేశ, పరమపురుష
నిత్య, నిరుపమ, నిరవద్య, నిగమవేద్య,
నిన్ను భజియింతు నిరతము నన్ను బ్రోవ.

రాణి:— నాథా! కానున్నది కాకతప్పునా? విధాతవ్రాఁత మనము దుడిచివేయఁగలమా? సర్వమునకు దైవమున్నాఁడు. దైవప్రార్థనమే మనకవచము. కావున దేవుని ప్రార్థింతుము.

[ అందఱును గూడి దైవస్తుతి యొనర్తురు. ]

యవంశమునకుఁ గళంకముఁ దెచ్చుటకంటెను అద్భుతమేమి. కావున వక్షస్థలమునఁ బాత్రహస్తుఁడై చేసి కొనుము.

పెదసర:— నాయనా! ఈ యుధమాధముని నంతగ వేడికొనుటచేలి? వేఁటకాని వెంకము క్షైదయఁ గలుగునా? కటికకుగొఱ్ఱెకసాయుగలుగునా? ( ఓబరునిఁజూచి ) ఓరీ: ఓబళా; నిరాయుధుఁడను నేను నాయుధుఁడవు నీవు. మల్లయుద్ధమొనర్తము రమ్ము నీపొగరడంచెద. (నాయన్ననుఁజూచి) పేడితనమున నీఁదు మల్లయుద్ధమునకు నమ్మతింపఁడేని, పరాధీనులును నిరాయుధులును నగు మనకు నాత్మహత్యయే హితము తుచ్ఛులచేఁ జావనేల? పుట్టినవారుగిట్టుట సిద్ధము. విజయనగరసింహాసన మెక్కిన రాజుల నేకులు చావక యున్నారా? మనము నుజచ్చువారమేను ఈ నీచునిఁ వేఁడికొననేల? (ఓబరునిఁ జూచి) ఓరీ నీచా; ఓబళా; మరణ మనకు సిద్ధులము యీనాన్న వారి పైగక లెత్తఁ జేసిన ప్రయోజనమేమి? సంహారింపుము రమ్ము.

చిక్కరా:— నాయనా: నిలు. నిలు. పుత్రశోకదుఃఖమీమరదృష్టునకుఁ గలుగనియ్యకు.

ఓరీ ఓబళా! ఏదీకృపాణమిమ్ము. ఆత్మహత్యకు సిద్ధపడి నిలచినాను.

చ. అలలనుఁబోలెఁ బుట్టి మఱియంతనె లేచిమునుంగు కైవడిన్
కలుములువచ్చుఁబోవు, మఱిఁగల్గును, నెంతటివానికైన జః
ఫలములుగా వెఱవ్వియునిజమ్మనిన మ్మెడు వారి నెన్న మూ
ర్ఖులు, కలలోని కల్మలను గొల్లఁ జేసెడివారు పో, ధరన్.

[ చిన్న ఓబరుఁడు ఖడ్గమిచ్చును. చిక్కరాయఁడు చేతఁబట్టును. ]

రాణి:— నాథా! నిలు. నిలు. పాదములపై బడెద. నీ ప్రాణప్రియకు వైధవ్యకళంకముంటనటు లనుగ్రహింపుము. అమ్మా కుప్పమ్మా! ఈ పిల్లను నాగలాంబిక నెత్తికొనుము. పతిచరణములకు నా శిరఃకమలమర్పించి ధన్యనగు సమయమున బిగువుగ నన్నుఁ గౌగలించినది. [అనుచు ముచ్చిడి మూర్ఛమందును ]

[ అందఱు నేడ్తురు. ]

రంగరా:— ప్రేయసీ! అగ్నిసాక్షిగ నా పాణిగ్రహణ మొనర్చిన నీవు పతిసర్వముతదర్పక యర్ధాంగియన నామము సార్ధకపఱచితివి. రాజపుత్రివగు నీవు నా సహవాసముచేఁ గష్టమనుభవించి, చివరకీ దుర్మరణ ప్రాప్తికి గురియైతివి. అకటకటా! ఎంతటిదుష్టుఁడను. ఎంతటిహతభాగ్యుఁడను నేను. ప్రియా! రమ్ము ముందరికి. మునుపుము నీ సవిమల్లమును. విడువుము నీ ప్రేమబంధము. దూఱుము నీభర్తను. చేరుము స్వర్గలోకము. కోరుము నీ దైవమును.

రాణి:— ప్రాణనాథా! ప్రత్యక్షదైవస్వరూపుఁడవై చేతఁ ఖడ్గము ధరించి స్వర్గమునకు దారిఁ జూపురు నీవు నిలిచియుండ వేఱుదైవమును నేఁగోరనేల? నా యారాధ్య దైవము యొక్క

చరణములివిదియేను. ఈచరణములు నా శిరఃకమలముచే నలంకరింపఁబడినవి. నాశిరంబుఁ దునుము.

ఉ. దారశిరమ్ముఁ ద్రెంపుము యదాకపవిత్ర చరిత్ర నే నమ
స్కారమొనర్తు నీకు మది సందియమేల? విరుద్ధధర్మమిం
దారయఁ గానరాదు పతియానతి మీఱను నేను వైరమే
దారుణఖడ్గ ధారకును దర్పణమిమ్ము మదీయరక్తముల్.

[ నాగలాంబ అమ్మాయిని యేడ్చును. ]

రంగ:— [ప్రేయసీ! నీ ముద్దుమోమును దయచూచుచున్నది. రమ్మా త్రాక్కు. [ప్రక్కనబిలిచి శిరఃఖండనము చేయును ] ఆవేశమున వెలికివచ్చి ముద్దురఁగన్నను ప్రక్కనుండి చంపును. అంతటిని నీవీలించంపును ] ఓరీ! నీచాధమా! వోబరా ఈ కసుగందను నాగలాంబను నేఁ జంపఁజాలను. నీవే చంపుము.

ఓబకోఁడు:— [ ఏడ్చుచున్న నాగలాంబనుబట్టి ప్రక్కకుఁ ద్రోసివేయును. ]

రంగరా:— [ ఓబకునిఁజూచి ] ఓబరా! నీ కోరికదీరెనుగదా. ఇఁక నిలచినవారు నేనును, వీరవరసింగరాయుఁడు. మేమును మాభగ్గములతో నే జత్తుము. మా ప్రాచీనకర్మఫలము మేమనుభవింతుము.

మ. అకటా రాజులజన్మ మీయవనిలో వ్యర్థంబు నిక్కంబుగా,
సుకరంబైతమ సన్నిధానమున వస్తుస్తోమముల్జేరఁగా
సకలైశ్వర్యసమేతులై వెలయుచున్ సౌభాగ్యంబు నిద్ధేలుచున్
వికటీభూత విపద్దశాధికత భావింపఁగ లేరెత్తఱిన్.

[ నా వంశాంకురము నీ వంశనాశనకారణముగ కూడదగు యాచమనాయుని పరసమెరయుచున్నది. ఆ యుంతము మే నా వంశాభివృద్ధికి గారణమగును. నీవంశనాశనమునకు గారణమగును. ఇదినిజము. [ అనుచు ప్రక్కనుండబోయి కరవాలముచే శిరము ఖండించుకొనును ]

వీరనర:— [ ఆవేశమునఁ దనభార్యను ఖండించి ] ఓరీ! క్రూరా! మా వంశస్త్రీలెవరును వైధవ్యదుఃఖమనుభవింపక స్వర్గలోకముఁ జేరిరి. ఇదిగో నీ భార్య వైధవ్యనరకమునఁబడి పొర్లును గాత.

[ అనుచు నోబకునిఁజంపి తాను కత్తిపైఁబడి చచ్చును.

[తెఱఁబడును.]

చాందు:---నాయకుడుగారూ! పరస్పర భాషణములిప్పుడేల? ఆ నీచుని రాజద్రోహిని రాజహంతకునిబట్టి తెప్పింపుమిగదా; వానివిచారణజరిగించి శిక్షింపుము.

యాచ:---సంతోషములో నావిషయమే మఱచియుంటిని. [ భటులనుఁజూచి ] భటులారా! చెఱసాలయందుండు జగరాయనిఁ బిడికెట్టలుగట్టి తెండు. అటులనే చిక్కరాయనిఁ బిలిచికొనిరండు.

భటులు:---( చిత్తమనుచు వెళ్లుదురు )

యాచ:---[ మఱియొక భటునిఁజూచి ] ఓరీ నీవు వేగముగఁబోయి యీ యూరియందుండు పురోహిత కేశవయ్యను నతనిభార్యయగు భాగమ్మను బిలిచికొనిరమ్ము.

భటుఁడు:---[ చిత్తమనుచు వెళ్లును ]

చాందు:---యాచమనాయకుఁగారూ! వీరి నేలపిలిపించితిరి?

యాచమ:---భాతా సారూ! వెంకటరామరాజుగారు మరణమునొందుటకు ముందు నారసపుత్రుఁడుండెనను శ్రీరంగరాజుగారికిఁ బట్టముకట్టినది యన్యాయమనియే నాయకులయభిప్రాయము. వారికిఁగల యౌరసపుత్రసత్వము బయలుపడినచో నాకు తెలియును. పెద్దరాయలవారికిని దెలియును. వారు స్వప్రయోజనాభివృద్ధికిని శ్రీరంగరాజుకుఁ బట్టముగట్టిరి ఈ సంగతి బయల్పడినచో జనులమానసమునందుండు సందియముఁ బాపవలెనని నా యభిప్రాయము.

చాందు:---మంచియాలోచనయిది లేనికలఁతలకుఁ గారణము లేనటుల ప్రారంభముననే సందేహాంకురమును గిల్లివేయుటమేలు.

[ జగరాయని పిడికెట్టలుగట్టి భటులు తెత్తురు. ]

యాచ:---ఓరీ! రాజద్రోహీ! రాజహంతకా! నిక్కిచెప్పెదవేల? ఇచటఁగూర్చున్న చిన్న వెంకటరాజునకు సాష్టాంగదండప్రణామంబు లాచరింపుము.

జగరా:---యాచమనాయకుఁడా! నీచెంతఁజిక్కితి, నన్నుమానుపముగఁజూచెదవు. మారాజా వేఱు మీరా జీవేఱు.

యాచ:--- ఓరీ! ఇప్పడానీకు మానవమర్యాదల తారతమ్యముఁదెలిసినది. నీప్రవర్తనే దద్వు.

చాందు:---ఓరీ వచనభ్రష్టా! వంచకా! నీచా! నిండుసభలోనాఁడు నా చెల్లెలిని నీవాడినమాటలు శూలములుగ నాయెదఁబొడుచుచున్నవి. ఇప్పుడు రాణివాసముననుండు నీ యాఁడుదాని నీ సభకుఁ బట్టితెప్పించి మోముముసుఁగులు తీయింతునా?

కుమునివి:---అన్నయ్యా! అట్టిపని మనకువలదు. మగవారొనరించు దుండగములకు వారివారిని శిక్షింప నగునా?

యాచ:---భటులారా! ఆ నీచుని, రాయలవారి చరణములపైఁ ద్రోసి నమస్కరింపఁజేయుఁడి.

[ భటులటు లొనరింతురు. ]

( కేశవయ్యయు ఛాయమ్మను విలిచికొని భటులు ప్రవేశింతురు. )

యాచ:—కేశవయ్యగారూ! మీరు రాజప్రరోహితులుగదా?

కేశవయ్య:—నిజమండి నిజము.

యాచ:—ఆ గృహిణి మీ భార్యగదా?

కేశవయ్య:—అవును. అగ్నిసాక్షిగ నేఁ బెండ్లిచేసికొంటిని. (?)

యాచ:—ఆ యమ్మగారెందఱిని పిల్లలనుగనినారు.

కేశవ:—కేశవ, నారాయణ, మాధవ, గోవింద, విష్ణు, శ్రీకృష్ణ, ఇరవై నాల్గురుపిల్లలను కనినది. అయిదో రేమో యమునపిల్లలను గనినది. పదువాల్గుపిల్లలను గనినది.

యాచ:—అందఱు పిల్లలు బ్రదికినారా?

కేశవ:—ఓకఁడుదప్ప నిరువదిమువ్వురు పిల్లలున్నవారు.

ఛాయ:—అవలక్షణమేల పల్కెదవు? ఇరవైనాల్గుపిల్లలును దిండ్లై బ్రదికినారు.

కేశవ:—ఏమే. ఇప్పుడు పండ్రెండేండ్ల క్రిందట నొకపిల్లవాఁడు పోయెనని చెప్పితివే.

ఛాయ:—( జ్ఞాప్తిచేసికొనినవారింబలె నభినయించి ) నిజము. నిజము. ఒకపిల్లవాఁడు పోయెను.

యాచ:—ఛాయమ్మగారూ! నిజముతెలుపుదురా? మిమ్ముదండింప నాజ్ఞయిత్తునా?

ఛాయ:—(భయపడుచు) నిజముదొర. నేనిరువదినాల్గుపిల్లలను గనినదినిజము. ఒకపిల్లవాఁడు పోయినదినిజము.

యాచ:—పోయెననఁగా నేమి? చచ్చెనా?

ఛాయ:—మాయమైపోయెనయ్యా!

యాచ:—ఛాయమ్మగారూ! పోయినరహస్యమంతయును నాకుఁ దెలయును. నిజమును దెలుపుడి. కాదేని మిమ్ముఁ గారాగృహమునుంచి శిక్షించెద.

ఛాయ:—(వడఁకుచు) అయ్యా! ఇట్టివార్తలు సభలో నాడువారిని నడుగుటఁదగదు.

యాచ:— అమ్మా! ఈ యాడువారిరహస్యకృత్యములవలనిడియే, రాజ్యములు తలక్రిందులగుట. మంచిది. ఉన్నవార్తయున్నటుల దెలుపుడి. ఏవార్తదాచికొనినను మీకుక్షేమముగాదు.

కేశవ:—చెప్పవే! అదియేమిరహస్యమో; నా యింటికిఁ గుంపటి తెచ్చిపెట్టితివి.

ఛాయ:—అవును. కావుననే పండ్రెండేండ్లు సుఖముగ బ్రదికితిమి.

యాచ:—మాటలతోఁ బ్రొద్దుపుచ్చకుఁడి.

ఛాయ:—అయ్యా! ఛాయమ్మగారు తనయులులేక తపించుచుండిరి. వారివ్యసనమును నేఁ జూడఁజాలక, అమ్మా! నీవును వేకటియయినట్టు నటింపుము. నేఁ గనినతోడనే యాశిశువును మంత్రసానిచే నెవరికినిఁ దెలియనటుల నీవద్దికిఁ బంపెదననిచెప్పితిని. ఆమె యటులొనరించెను. నేఁ గన్నతక్షణమే శిశువు నామెవద్దికిఁ బంపితిని. ఆమెయుఁ గనినానని ప్రకటించెను.

అబలురబాలురనన్యాయ ప్రతిని
సంహరించెడుగటా సాహసమున
సాహసికైనరయేచమనాయకుండును
మాకూవిశ్రుతి కుమురిచెలంగితి

గీ. కడకు శైకులపాల్పడికట్టుబడితి
అంతకుని సాటియగు తిగానడఁబడితి
ఏను సేయు దురాశనంతంతఁజేసె
ధాతత్రాత సప్పురపదర మీధరణి.

[సభ్యులనుద్దేశించి] శూరవరులారా! సభాస్తారులారా! రాయలవారి సద్గుణాకారమిది. ఈ రాజకుమారుని విజయనగర రాజ్య సింహాసనమెక్కించి జీర్ణమగు కర్ణాటక రాజ్యమునంతయుఁ స్థాపించు భారము మీయది. అప్పని రేపటిదినంబున నేను నిర్వర్తింపఁగలను.

చాందుఖాన్:— సభాస్తారులారా; ఇంతటిసాహసకార్యంబొనరించి జీర్ణకర్ణాటకరాజ్యముద్ధరించి దశదిశలంతటను యశమును స్థాపించిన యేచమ నాయకుడు గారికిని వారితో సమానముగ శౌర్యసాహసములు చూపుచువచ్చిన నా సోదరియగు కామునురకిని రేపటిదినమిచట వివాహమహోత్సవము జరుగును కావున నా కౌతుకమహోత్సవమును దర్శింపను మీరెల్లరు రేపు చేయుదురని వేడెదను.

యాచ:— సభాస్తారులారా; మనరాయలవారు ప్రబుద్ధులగు వరకును వారి ప్రతినిధ్యమునుగ వారి ప్రాణమిత్రులగు చాందుఖాన్ గారిచేత నుండి రాచకార్యములు నడపుచుందురు. సభ్యులారా! ప్రొద్దుమీరినది మనమిఁక కార్యభారంబు చాలించి గృహములకు బోదుము.

[నిష్క్రమణము].

సమాప్తము.